# ఆంధ్రపత్రిక

THE ANDHRA PATRIKA- MADRAS. సంపుటం 43. సంచిక 13 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO శనివారం 14-4-1956 Reg. No. M. 1118. 6 పేజీలు 1 అణా


# చదువులలో పశ్చిమ గోదావరికి రాష్ట్రంలో అధమ స్థానం

## 'ఆంధ్ర ప్రదేశ్' అనే పేరుకు హైదరాబాదు శాసనసభ ఆమోదం

### మహారాష్ట్రకు బొంబాయి ముఖ్య పట్టణం కావాలని తీర్మానం

హైదరాబాదు, ఏప్రిల్ 12: ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలను కలిపి ఏర్పాటుచేసే రాష్ట్రం పేరును 'ఆంధ్ర ప్రదేశ్' అని మార్చాలన్న సవరణను హైదరాబాదు రాష్ట్ర శాసనసభ నేడు ఆమోదించింది.

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కార్యక్రమానికి సంబంధించిన సూత్రాలను ఆమోదించుచూ, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లును కొన్ని మార్పులతో ఆమోదించవలెనని ముఖ్యమంత్రి డాక్టరు బూర్గుల రామకృష్ణరావు ప్రతిపాదించిన తీర్మానాన్ని శాసనసభ ఆమోదించింది.

బిల్లులోని క్లాజులకు వచ్చిన సవరణలపై అయిదుసార్లు సభలో వోటింగ్ జరిగింది.

బొంబాయి నగరాన్ని మహారాష్ట్రంలో చేర్చమని శాసనసభ సిఫార్సు చేసింది. బొంబాయి నగరాన్ని కేంద్ర ప్రభుత్వ పాలిత ప్రాంతంగా పరిగణించాలని బిల్లులోని 8 వ క్లాజు కోరుతున్నది. ఈ క్లాజును బిల్లునుంచి తొలగించాలని ప్రతిపక్ష సభ్యులు తెచ్చిన సవరణకు అనుకూలంగా 69, వ్యతిరేకంగా 60 వోట్లు వచ్చినవి. సవరణ నెగ్గింది.

మంత్రులు శ్రీ దిగంబరరావ్ బిందూ, వినాయక్ రావ్ విద్యాలంకర్, గోపాలరావ్ ఎక్బోటెగారలతో సహా మరాట్వాడా కాంగ్రెసు శాసన సభ్యులు సవరణపై వోటుచేయలేదు. ఈ అంశంపై ఇట్లా వోట్ చేసి తీరాలని మరాట్వాడా జిల్లాల కాంగ్రెసు సభ్యులకు కాంగ్రెసుపార్టీ ఆదేశమేమీ ఇవ్వలేదని తెలిసింది. సవరణకు వ్యతిరేకంగా కాంగ్రెసు సభ్యులు 60 మంది వోటుచేయగా ప్రతిపక్ష సభ్యులు 68 మంది అనుకూలంగా వోటుచేశారు. బొంబాయి నగరానికి సంబంధించిన ఈ సవరణకు అనుకూలంగా వోటు చేయవద్దని తెలంగాణా, కర్నాటక ప్రాంతాల కాంగ్రెసు సభ్యులను మాత్రం పార్టీ ఆదేశించింది. కావాలంటే మరాట్వాడా సభ్యులు ఓటింగులో పాల్గొనకుండా పోవచ్చని కాంగ్రెసు పార్టీ సూచించింది. మరాట్వాడా ప్రాంతానికి చెందిన 37 మంది సభ్యులు వోటింగులో పాల్గొనలేదు.

అంతకుముందు రాష్ట్రాల బిల్లుపై జరిగిన చర్చకు సమాధానం చెబుతూ బొంబాయినగరాన్ని మహారాష్ట్రంలో చేర్చాలనే సవరణ విషయమై పట్టు పట్టవద్దని సభ్యులకు ముఖ్యమంత్రి విజ్ఞప్తి చేశారు. "ఇటువంటి ప్రతిపాదనను బొంబాయి, మధ్యప్రదేశ్ రాష్ట్ర శాసనసభలు ఆమోదించలేదు. హైదరాబాదు శాసనసభ ఇటువంటి ప్రతిపాదనను ఆమోదించితే చిక్కులు వస్తవి. మన నాయకులు పొరపాటేమయినా చేసివుంటే దాన్ని వారు సరిచేసే అవకాశమిద్దాం. అంతేకాని యింకా చిక్కులు కలిగించడం మంచిదికాదు" అనికూడా ముఖ్యమంత్రి అన్నారు.

మహారాష్ట్రంలో చేర్చవలసిన ప్రాంతాలను బిల్లులోని 9-వ క్లాజు నిర్వచిస్తున్నది. బొంబాయి నగరాన్ని కూడా ఆ ప్రాంతాలలో చేర్చమని కోరుతూ 6 గురు ప్రతిపక్ష సభ్యులు తెచ్చిన సవరణకు అనుకూలంగా 69, వ్యతిరేకంగా 61 వోట్లు వచ్చినవి. ఈ సవరణకూడా నెగ్గింది. మొదటి సవరణ పర్యవసానమే రెండవ సవరణ. బిల్లులో ఏర్పాటవనున్న కొత్త రాష్ట్రాలలో 'ఆంధ్ర తెలంగాణా'ను చేర్చమని కోరుతూ ప్రతిపక్ష సభ్యులు తెచ్చిన మరొక సవరణకు వ్యతిరేకంగా 97, అనుకూలంగా 68 వోట్లు వచ్చినవి. సవరణ వీగిపోయింది.

ఇదే విధంగా ఏర్పడనున్న కొత్త మైసూరు రాష్ట్రానికి కర్ణాటక రాష్ట్రమని పేరు పెట్టమని కోరుతూ వచ్చిన మరొక సవరణకు వ్యతిరేకంగా 91, అనుకూలంగా 69 వోట్లు వచ్చినవి; సవరణ వీగిపోయింది. పబ్లిక్ వర్క్సుశాఖ మంత్రి డాక్టరు జి.ఎస్. మేల్కోటే, శ్రీమల్లప్ప కొల్లూర్‌తో సహా ఆరుగురు కన్నడిగ సభ్యులు ఈ సవరణపై వోటింగ్‌లో పాల్గొనలేదు.

ఆ తరువాత ఆంధ్ర శాసనసభ ఇప్పటి నియోజకవర్గాలకు, తెలంగాణా నియోజకవర్గాలకూ కూడా దేశంలో అన్ని ప్రాంతాలలో ఈసారి జరిగే ఎన్నికలతోపాటు ఎన్నికలు జరగాలని సూచించుచూ ప్రతిపక్ష నాయకుడు శ్రీ వి. డి. దేశపాండే తెచ్చిన సవరణపై వోటింగ్ జరిగింది. సవరణకు వ్యతిరేకంగా 95, అనుకూలంగా 68 వోట్లు వచ్చినవి. సవరణ వీగిపోయింది.

ఆంధ్ర తెలంగాణా అనే పేరును 'ఆంధ్రప్రదేశ్' అని మార్చమని కోరుతూ శ్రీయుతులు కె. పుల్లారెడ్డి, వి. డి. దేశపాండే గారలు సూచించిన సవరణలను సభ ఆమోదించింది. ఈ అంశంపై స్వేచ్ఛగా వోటుచేసే వీలు సభ్యులకు కాంగ్రెసుపార్టీ ఇచ్చింది.

బిల్లుపై శాసనసభలో మొత్తం ఆరు రోజులు చర్చ జరిగింది. మొత్తం 8 సవరణలు వచ్చినవి. చిన్న చిన్న మార్పులను ముఖ్యమంత్రి ఆమోదించారు.

ప్రధాన తీర్మానంపై వోటింగు జరిపించవలెనని ముఖ్యమంత్రి ప్రతిపాదించగా రాజ్యాంగం ప్రకారం మూడింట రెండువంతుల సభ్యులు ఆమోదింపవలసిన అవసరమున్నదని ... వోటింగు జరిపే వీలుండదని తీర్మానాన్ని సభ ఆమోదించరాదని ప్రతిపక్ష నాయకుడు శ్రీ దేశపాండే ఆక్షేపణ చెప్పారు.

అందుకు ముఖ్యమంత్రి ...

5 వ పేజీ 1 వ కాలం చూడుడు

## పాకిస్తాన్‌కు బాగా సైనిక సహాయం

### బాగ్దాద్ కూటంద్వారా.

కరాచీ, ఏప్రిల్ 11: టెహరాన్‌లో యీనెల 16 వ జరగబోయ్యే బాగ్దాదు ఒడంబడిక రాజ్యాల సమావేశంలో తనకు యింకా ఎక్కువగా సైనిక, ఆర్థిక సహాయం కావాలని పాకిస్తాన్ కోరుతుందని పాకిస్తాన్ వర్గాలు తెలియజేశాయి.

భారతదేశం, ఆఫ్ఘనిస్తాన్‌లతో తన కున్న తగాదాలమూలంగా, సైనికంగా మంచి తయారీలో ఉండాల్సిన అవసరం విషయమై పాకిస్తాన్ యీ సమావేశంలో వాదిస్తుందని అనుకుంటున్నారు.

ఈ సమావేశంలో పాల్గొనటానికి వెళ్ళే పాకిస్తాన్ ప్రతినిధి వర్గానికి, ప్రధానమంత్రి చౌదరి మహమ్మదాలీ నాయకత్వం వహిస్తారు. విదేశాంగ మంత్రి శ్రీ హమీదుల్ హక్ చౌదరీతోపాటు యింకా 10 మంది సభ్యులుగా ఉంటారు.

## పోలెండ్‌లో భారత వాణిజ్య ఒప్పందం

క్రొత్తఢిల్లీ, ఏప్రిల్ 11: 1956, 57, 58 సం॥ లలో పోలెండ్ దగ్గర 3 లక్షల టన్నుల ఇనుము-ఉక్కు సామాన్లను, లక్ష టన్నుల సిమెంటును కొనటానికి భారతదేశం చేసు ఒప్పందం చేసుకున్నది. పోలెండ్ భారతదేశందగ్గర 6 లక్షల టన్నుల ఇనుప ఖనిజాన్ని తెప్పించుకుంటుంది.

లక్ష టన్నుల సిమెంటు 1956 ఆగస్టు నుంచి 1957 మార్చిలోపల దిగుమతి అవుతుంది.

ఇనపఖనిజం అమ్మకంకోసం ప్రత్యేకించి ప్రభుత్వ వ్యాపార సంస్థ ఒకటి ఏర్పడుతుంది. అది ఏర్పడేలోపల కేంద్ర వాణిజ్య పరిశ్రమలశాఖ ఆ బాధ్యతను నిర్వహిస్తుంది.

## అచటి ఎరుకకు ఎరుక దేశహితార్థము

### కొవ్వలిలో శ్రీ బండి సుబ్బాయి వితరణ—ముఖ్యమంత్రి సత్కారం

[స్వకీయ విలేఖరి]

ఏలూరు, ఏప్రిల్ 11: "ముఖ్యమంత్రి వచ్చారు. రమ్మంటున్నారు" అని శ్రీ బండి సుబ్బాయికి (ఎరుకల) కబురు వచ్చింది. "ఇదేమిటోరా బాబు!" అని కాపీవ్యాపారి శ్రీ సుబ్బాయి ... ముఖ్యమంత్రి, అతనికి ... కరచాలనం చేసి, పళ్లియిచ్చి, సత్కరించారు.

ఏలూరుకు 4 మైళ్ళ దూరంలో ఉన్న కొవ్వలి గ్రామస్థులు పిన్న పెద్ద, ధనికుడూ బీదవాడూ అనే తారతమ్యం లేకుండా శ్రీ ... దానముచేసి ... 75 వేల ఖర్చుచేసి ఉన్నతపాఠశాల భవనం నిర్మించారు. ఆ విషయాన్ని ముఖ్యమంత్రికి తెలియచేస్తూ ఒకరైన శ్రీ ... గ్రామ ... అయిన శ్రీ బండిసుబ్బాయి కూడా పాఠశాలకు రూ 150 విరాళమిచ్చాడని తెలియచేయగా మంత్రి అతనిని చూడ కోరి కబురంపారు.

శ్రీ సుబ్బాయి ఎందుకోననుకుని సమావేశానికి వచ్చాడు. ... ముఖ్యమంత్రి ... అతనిని సత్కరించారు. ... మంచివిషయమేనని ... రాలు ఉన్నదని బదులు చెప్పాడు.

మంత్రిసత్కారం అందుకుని శ్రీ సుబ్బాయి సభ్యులందరికీ వందనంచేసి వెళ్లిపోయాడు.

## ఇద్దరు తల్లులా?

### కర్ణాటకలో శ్రీ నెహ్రూ ఆశ్చర్యం

కర్నూ, ఏప్రిల్ 11: 'భారత్ మాతాకీ జై' అన్న నినాదం తరవాత 'జై కర్ణాటకమాతా' అనే కేకలు వినబడగా శ్రీ నెహ్రూకు వినబడ్డాయి.

"ఈ నూతన మాత ఏమిటి? భారత మాత ఒక్కతె చాలదా ఏం?" అని శ్రీ నెహ్రూ ఒక బహిరంగసమావేశంలో అడిగారు.

"ఒక యింట్లో చాలామంది తల్లులుంటే కందరగోళంతోపాటు తగాదాలు బయలు దేరుతాయి. మీరొకవిధంగా కోరుకుంటారా" అని శ్రీ నెహ్రూ ఆ నేటప్పటికి ... పార్థ్యాలు చేశారు.

"... యింట్లో ... ఒక్క ... కావాలె ... బిడ్డలకు ఒక్కతే తల్లి ఉండాలి" అన్నారు శ్రీ నెహ్రూ.

## బాధ్యులు పరిశీలించాలని కొవ్వలిలో ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డి హెచ్చరిక

### పాఠశాలలకు విరాళాలు ఇచ్చేవారు షరతులు పెట్టవద్దని విన్నపం

(స్వకీయ విలేఖరి)

ఏలూరు, ఏప్రిల్ 12: "పశ్చిమ గోదావరిలో ఉన్నత పాఠశాలలూ, కళాశాలలూ వీనిలో చదివే విద్యార్థుల సంఖ్యా హెచ్చినందులకు చాలా సంతోషం. ఏలూరు తాలూకాలో 13 హైస్కూల్లున్నాయని తెలిసింది. కానీ, గత సంవత్సరం స్కూలుఫైనలు పరీక్షా ఫలితాలు గమనిస్తే, ఆంధ్రలోగల 11 జిల్లాలలో పశ్చిమ గోదావరి అధమస్థానం వహించింది. ఈ పరిస్థితికి కారణమేమో, ఉపాధ్యాయులు, విద్యార్థులు, తలిదండ్రులూ వీరిలో ఎవరు ఎంతవరకూ బాధ్యులో పరిశీలించి తగిన చర్య తీసికొని, విద్యాప్రమాణాలను వృద్ధిచేసికోవాలి" అని కొవ్వలి గ్రామపౌరులు యిచ్చిన సన్మానానికి జవాబిస్తూ ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డి హెచ్చరించారు.

మంత్రికి గ్రామస్థులు నాదస్వర వాద్యంతో స్వాగతమిచ్చారు. దెందులూరు శాస్త్రుల్లు, సుప్రసిద్ధ పండితులు అయిన శ్రీ దూబగుంట నాగేశ్వరరావును ముఖ్యమంత్రికి పరిచయం చేశారు.

శ్రీ వడ్లపట్ల గంగరాజు స్వాగతమిస్తూ, గ్రామస్థులు కృషిచేసి ఉన్నత పాఠశాల భవన నిర్మాణం దాదాపు పూర్తిచేశారనీ, ఈ పాఠశాలను సకలార్థసాధక ఉన్నతపాఠశాలగా ప్రభుత్వం రూపొందిస్తే, గ్రామస్థులు శ్రీ నెక్కలపు శోభనాద్రి రు 25 వేలు విరాళం యిస్తామని వాగ్దానంచేశారనీ, ప్రభుత్వం వారి విరాళం అంగీకరించి, ఆ విధంగా సకలార్థ సాధకోన్నత పాఠశాల నెలకొల్పాలనీ అన్నారు.

శ్రీ వడ్లపట్ల రామచంద్రయ్య గ్రామస్థుల తరఫున, ప్రధానోపాధ్యాయులు పాఠశాల తరఫునా స్వాగతపత్రాలిచ్చారు. శ్రీ పెలమాటి పద్మనాభం గ్రామస్థులంతా కాయకష్టంచేసి పాఠశాల భవనం నిర్మించారనీ, ఈ పాఠశాల ఈ స్థితికి రావడానికి శ్రీ వడ్లపట్ల మల్లిఖార్జునరావు కృషి కారణమని అన్నారు.

### షరతులు వద్దు

ముఖ్యమంత్రి జవాబిస్తూ, గ్రామస్థులు ఈ విధంగా స్వయంసహాయంద్వారా పాఠశాలా భవన నిర్మాణం చేసికొన్నందుకు అభినందించారు. శ్రీ శోభనాద్రి తమ విరాళాన్ని షరతులుగా యిచ్చిఉంటే బాగుండేది అన్నారు. సకలార్థ సాధక పాఠశాలల స్థాపన ప్రభుత్వం ఒక నిర్ణీత పథకం ప్రకారం అమలుజరుపుతోందనీ, అందువలన అధికారులతో సంప్రతించకుండా తాము వెంటనే ఏమీ చెప్పజాలమనీ, వచ్చే జూలైకి కాకపోయినా సాధ్యమైనంత త్వరలో వారి కోరిక నెరవేరేందుకు తను శక్తివంచన లేకుండా కృషిచేస్తామనీ, ఈలోగా ఆ మొత్తాన్ని బ్యాంకిలో కట్టవలసిందనీ సలహా యిచ్చారు.

### ఆసుపత్రి ముందుగు

ముఖ్యమంత్రి జిల్లా ఆస్పత్రిని (ఏలూరు) సందర్శించారు. జిల్లా వైద్యశాఖాధికారి శ్రీ ఎతిరాజులు స్వాగతం యిచ్చి ఆస్పత్రి అంతా చూపించారు. ముఖ్యమంత్రి ఈ ఆస్పత్రిలో మంచాల సంఖ్య యిదివరకున్న 95 నుంచి 150 కి హెచ్చించారనీ, ఆ ప్రకారం యితర ఏర్పాట్లు కూడా మంజూరు చేశారనీ తెలియచేశారు.

ఆసుపత్రి సలహా సంఘం తరఫున గవర్నమెంటు ప్లీడరు జనాబ్ అలీ సాహెబ్ గారు మంత్రిగారిని పుష్పమాలాలంకృతులను చేశారు.

శ్రీ ఎస్. కె. వి. కృష్ణావతారం ఆస్పత్రి మురుగునీరు సరిగా బయటకు పోయే ఏర్పాటు స్థానికకౌన్సిలు పరిధిలో ప్రజలకు బాగా కల్పించని విన్నవించగా, మంత్రి ఇంజనీరును పిలిచి, ఈ విషయమై వెంటనే చర్య తీసికోవలసిందిగా చెప్పారు.

### బుడమేరు పథకం

#### రైతు ప్రతినిధులకు ప్రభుత్వ ఆహ్వానం

కర్నూలు, ఏప్రిల్ 13: బుడమేరు పథకం విషయం చర్చించడానికి, రాష్ట్ర ప్రభుత్వం, కృష్ణాజిల్లా రైతు ప్రతినిధులలో కొందరిని కర్నూలుకు ఆహ్వానించింది. ఆహ్వానాలు వచ్చిన వారిలో శ్రీ కాశేశ్వరరావు, శ్రీ ఎం. ఆర్. అప్పారావు ఉన్నారు.

ఆంధ్ర మంత్రివర్గం యీనెల 27 వ తేదీన సమావేశమై, మంత్రిత్రయం బుడమేరు పథకం విషయంపై సేకరించి సమర్పించే సమాచారాన్ని దృష్టిలో పెట్టుకొని బుడమేరు పథకాన్ని పునః పరిశీలన చేశారు.

## విద్వేషాలు వదలి ప్రయోజనకర పథకాలను అమలుచేయుడం అవసరం

### ఆంధ్ర ధాన్యాగారానికి నష్టం కలిగిస్తున్న కొల్లేటి వాగులకు రిజర్వాయిర్లు తప్పవని ఇంజనీర్ల భావం

(ఆంధ్రపత్రిక ప్రత్యేక ప్రతినిధి)

"ఆంధ్ర దేశానికి ధాన్యాగారమైన కృష్ణా గోదావరి జిల్లాల ప్రాంతానికి ముంపు ప్రమాదాన్ని, వరద బెడదను తప్పించాలంటే బుడమేరు, తమ్మిలేరు, ఎర్రకాలవ, కొల్లేరు పథకాలన్నింటిని ఒకే సమగ్ర పథకంగా పరిగణించి ఒకేసారి అమలు జరిపించడం అవసరం. బుడమేరు రిజర్వాయర్ పథకమనేది సాంకేతికంగా చాలా మంచి పథకం. విద్వేషాభిప్రాయాలేమీ మనసులో పెట్టుకోకుండా కలిగే ప్రయోజనాలనుబట్టి రిజర్వాయిర్ నిర్మాణ పథకం మంచి చెడులను నిర్ణయించాలి" అని ఒక ఇంజనీరింగ్ నిపుణుడు చెప్పారు.

రిజర్వాయర్ అవసరాన్ని ఆయన ఇట్లా వివరించారు: "వరద ఉద్ధృతాన్ని తగ్గించేందుకు రిజర్వాయర్లు అవసరమన్నది ప్రపంచమంతా ఆమోదించిన సూత్రం. టెన్నెసీ లోయలో 40 రిజర్వాయర్లున్నవి. దామోదర్ లోయలో ఆరు రిజర్వాయిర్లున్నవి."

### మళ్లింపులే చాలవు

"రిజర్వాయిర్లవల్ల కలిగే ప్రయోజనాలు మళ్ళింపు కాలవలవల్ల నే కలిగేట్లయితే పై సందర్భాలన్నింటిలోను రిజర్వాయర్లను వదలివేసి మళ్ళింపు కాలవలను మాత్రమే త్రవ్వించి ఉండేవారు. మళ్ళింపు కాలవ ఉద్దేశం నెరవేర్చగల ప్రయోజనం చాలా పరిమితం."

కృష్ణా, గోదావరి డెల్టా ప్రాంతమనేది ఆంధ్రకు కాదు నికాలాంధ్రకు ధాన్యాగారం. ముంపు బయటకుపోయే సౌకర్యాలు లేకపోవడం చాలా పంట పాడై పోతున్నది. వరదలవల్ల కలుగుతున్న నష్టాన్ని భారతప్రభుత్వం గమనించి వరద నిరోధక పథకాలపై శ్రద్ధాసక్తులు చూపిస్తున్నారు."

### ఒకే ఒక పథకం

"ఆంధ్ర దేశానికి ధాన్యాగారమైన కృష్ణా గోదావరిజిల్లాల డెల్టా ప్రాంతానికి వరద బెడదను నివారించాలంటే బుడమేరు, తమ్మిలేరు, ఎర్రకాలవ, కొల్లేరు పథకాలన్నింటిని ఒకే ఒక సమగ్రపథకంగా పరిగణించి అమలు చేయడం అవసరం. ఈ పథకంలో బుడమేరు రిజర్వాయిర్ నిర్మాణం ప్రారంభించి, వీటన్నిటిని అమలు చేసేందుకు దాదాపు రుగ కోట్ల పథకాలను ప్రభుత్వం తయారుచేశారు.

### వరదఆదుపే లక్ష్యం

"వరదను అదుపులో పెట్టడమే రిజర్వాయరు ఉద్దేశం. అన్నివిధాల ఇంకా బాగా ఉపయోగపడటానికి వీలుగా ఇంతకంటే పెద్ద రిజర్వాయరు నిర్మాణము తలపెట్టేఉంటే ఇంకా బాగుండేది. అయితే ప్రస్తుతం 15 వేల క్యూసెక్కుల రజర్వాయరు చాలుఅని అనుకున్నారు. ఈ రిజర్వాయర్‌లోని నీరు 8 గంటల్లో ఖాళీ అయిపోతుందనడం వివేకంకాదు. వాననీటి ప్రమాదాన్ని తగ్గించి వరదనీటిని కొంతసేపు ఆటకాయించి, మళ్ళింపు కాలవద్వారా అవతలికి పంపించడమే రిజర్వాయర్ ఉద్దేశం."

### సగమే మళ్లుతుంది

"ఎంతబాగా ఉపయోగించినా వరద నీటిలో సగాన్ని మాత్రమే మళ్ళింపు కాలవ అవతలికి పంపించగలదు. కాదు ఇంకా ఎక్కువనీటిని కాలవలద్వారా అవతలికి మళ్ళిస్తామని అనవచ్చు. కాని అటువంటివాటివల్ల అదే ప్రయోజనం ఉండదు. కాలవలోనూ, కాలవ ఏటిలో కలిసేచోటకూడా పూడిక చేరకుండా, ఇసుక మేటలు వెయ్యకుండా చూడ్డానికి చాలాఖర్చు చేయవలసి వుంటుంది."

### కేవలం మళ్లింపు తెలివైన పనికాదు

"ఏదాదిలో ఎప్పుడో నాలుగు రోజులు అవసరానికని పెద్ద మళ్ళింపు కాలవను త్రవ్వించడం తెలివిగలపని కాబోదు. అందుకు బదులు రిజర్వాయర్ ను అరడజను పూర్తు నీటితో నింపి మెల్లిమెల్లిగా అవతలికి పంపించవచ్చు."

### మళ్లింపు ప్రయోజనకరం కాదు

"బ్లాక్ సెలలో రిజర్వాయర్ నీటిని నిలవచేసి ఏలూరు కాలవద్వారా నాట్లకు సప్లయి చేయవచ్చు. రిజర్వాయర్ అనేది లేకుండా మళ్లింపుకాలవ ప్రయోజనకారికాదు."

### వరసక్రమం

"బుడమేరు రిజర్వాయర్ ను అటిటేసి తమ్మిలేరు పథకం అమలుచేసే వీలు లేదు. తమ్మిలేరుకు బుడమేరు పోటీ పెట్టి లాభంలేదు. బుడమేరు, తమ్మిలేరు, ఎర్రకాలవలకు రిజర్వాయర్లను నిర్మించితేనేగాని కొల్లేరు ప్రాంతానికి ముంపు ప్రమాదం తప్పదు."

"వరద ప్రమాదాన్ని నివారించి డెల్టాప్రాంతంలో పంటల నష్టం తప్పించడం ఈ రిజర్వాయర్ల ఉద్దేశం. శాశ్వతంగా నీటిపారుదల సౌకర్యం కూడా వీటివల్ల కలిగితే కలుగుతుంది. అంతమాత్రానే కేవలం నీటిపారుదల

6 వ పేజి 1 వ కాలంచూడుడు

## 'తమ్మిలేరు ప్రాజెక్టు తప్పక కట్టిస్తాము'

### ముఖ్యమంత్రి హామీ: కోర్టులకు ఎక్కవద్దని రైతులకు హితవు

(స్వకీయ విలేఖరి)

ఏలూరు, ఏప్రిలు 11: "తమ్మిలేరు ప్రాజెక్టు-వరద నివారణ పథకం పరిశీలన జరుగుతున్నది. పరిశీలన పూర్తి కాగానే ఈ పథకాన్ని తప్పక అమలు జరపగలమని వాగ్దానం చేస్తున్నాను. ఈ లోగా రైతులు అనవసరకోర్టు వ్యవహారాలలో దిగవద్దు. ప్రభుత్వం అందరి హక్కులూ రక్షిస్తుంది అని మనవిచేస్తున్నాను" అని దుగ్గిరాలగ్రామంలో జరిగిన బహిరంగసభలో ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి అన్నారు.

ముఖ్యమంత్రి పశ్చిమ గోదావరి జిల్లాలో 3 రోజులు పర్యటించే నిమిత్తం ఉదయం మెయిలులో వచ్చారు. స్టేషను వద్ద శ్రీయుతులు అల్లూరి బాపనీడు శ్రీ ముళ్లపూడి హరికృష్ణప్రసాద్ శ్రీ కీర్ల బ్రహ్మయ్య శ్రీ ఎస్. కె. వి. కృష్ణావతారం, శ్రీ మూల్పూరు రంగయ్య శ్రీ చింతలపాటి మూర్తిరాజు, శ్రీ పెండ్యాల రంగారావు, శ్రీ దాసరాజు వెంకట్రావు శ్రీ రాజనాల గోపాలరావు నాయుడు, శ్రీ డి. ఎస్. సుబ్రహ్మణ్యం, శ్రీ కొత్తమాసు కృష్ణారావు, శ్రీ మాకే కృష్ణారావు, శ్రీ మాకే వెంకటనారాయణ, శ్రీ ఈదర వెంకట్రామయ్య, శ్రీ వీరమాచనేని వెంకటనారాయణ, శ్రీ మాగంటి సీతారామదాసు, శ్రీ గారపాటి చిదనకయ్య, శ్రీ కట్టా సుబ్బారావు, శ్రీ ఎం. ఆర్. సాయి (జిల్లా కలెక్టర్) జనాబ్ రోషన్ (జిల్లా పోలీసు సూపరింటెండెంటు) శ్రీ దామోదర రెడ్డి (జిల్లా ప్లానింగ్ ఆఫీసర్) స్వాగతమిచ్చారు. చాటపర్రు ఉన్నత పాఠశాల విద్యార్థులు, 8 వ ఫారం వరకూ ఉచిత విద్య గరపాలని ఆంధ్ర ప్రభుత్వం నిర్ణయించినందుకు తమ కృతజ్ఞత వెల్లడించారు.

దెందులూరు ఆంధ్ర సేవా సంఘం కూడా స్వాగతం యిచ్చారు.

ఉదయం గోపాలరెడ్డిగారు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి కళాశాల సందర్శించారు. కళాశాల పాలక వర్గాధ్యక్షులు పెండ్యాలరంగారావు, శ్రీ దాసు రాజు వెంకట్రావు, ప్రధానాచార్యులు శ్రీ దేశరాజు సుబ్రహ్మణ్యం స్వాగత మిచ్చారు. అనంతరం శ్రీ సుబ్రహ్మణ్యం కళాశాల తరఫున ఒక విజ్ఞప్తి సమర్పించారు. అందులో కళాశాల విద్యార్థి వసతిగృహ నిర్మాణానికి ముందు రు 75 వేలు విరాళం యిస్తామని ప్రభుత్వం వాగ్దానం చేసి, తిరిగి యివ్వలేమని తెలియపర్చినందుకు విచారం తెల్పుతూ, ఆ విషయమై

5 వ పేజీ 3 వ కాలం చూడుడు

## పశ్చిమాసియాకు బ్రిటిష్ అమెరికన్ సేనలు?

### ఒకచెంప సమితి కార్యదర్శి పరిశీలిస్తుండగానే

కైరో, ఏప్రిల్ 12: ఎల్ అవుజా సైనిక ప్రాంతంలో ఈజిప్టు, ఇజ్రేల్ విమానాలకు పోరాటం జరిగినట్లు, ఈ పోరాటంలో ఒక ఈజిప్షియన్ జెట్ విమానం నేలమీద కూలినట్లు ఈజిప్టు సైనికాధికారులు తెలియజేస్తున్నారు. ఇజ్రేల్ ఈ పోరాటం తన సరిహద్దులలోనే జరిగిందని అంటున్నారు.

వీరు ఇట్లా చెబుతున్నారు: ఈజిప్టు విమానాలు ఇజ్రేల్ భూభాగం మీద ఉత్తరముఖమై పోతూవుండటం చూచి రెండు ఇజ్రేల్ విమానాలు వాటిని ఎదుర్కొన్నాయి. అప్పుడు యుద్ధం జరిగింది. ఇందులో ఒక ఈజిప్టు విమానము నేలకూలింది. అనంతరం మిగిలిన ఈజిప్టు విమానాలు వెనక్కి తిరిగి వెళ్లిపోయినాయి.

ఈ విమాన సంఘర్షణ, అదివరకు ఈజిప్షియన్ వీరులు ఇజ్రేల్ మీద చేసిన దాడి, లండన్‌లో మహాందోళనాన్ని కల్గిస్తున్నాయి. బ్రిటిష్ ప్రధానమంత్రి సర్ ఈడెన్ నేడు పశ్చిమ ఆసియా స్థితిగతులపై అమెరికా విదేశశాఖ ఉప కార్యదర్శి శ్రీ రాయ్ హెండర్సన్‌తో చర్చలు జరిపారు.

ఇలాంటి ఉదంతాలవల్ల సమితి కార్యదర్శి దౌత్యం దెబ్బతినవచ్చు ననికూడ ఇక్కడ ఒక భావం వినిపిస్తున్నది. శ్రీ హెండర్సన్ టెహరాన్‌లో జరుగనున్న బాగ్దాద్ సంధి రాజ్యాల సమావేశంలో పరిశీలకుడుగా పాల్గొనడానికి పోతూ ఇక్కడ ఆగారు. ఈ సందర్భంలో శ్రీ ఈడెన్ సభలో ఈ విషయాలను ప్రస్తావించారు.

ఈలోగా అమెరికా పశ్చిమ ఆసి

6 వ పేజి 6 వ కాలంచూడుడు

# 4 వేలపుట్ల పత్తి దగ్ధం

## సూరత్ సమీపంలో జరిగిన ప్రమాదం

సూరత్, ఏప్రిల్ 10: ఇక్కడికి 30 మైళ్ళలోని అంక్లేశ్వర్‌లోని జిన్నింగ్ ఫ్యాక్టరీలో సంభవించిన అగ్ని ప్రమాదంలో నాలుగు వేలపుట్ల పత్తి పరశురామప్రీతి అయింది. సుమారు రు 20 లక్షల పత్తి ధ్వంసమైందని అంచనా.

నర్మదానదికి మైలుదూరంలో అంక్లేశ్వర్ స్టేషను సమీపంలో ఈ ఫ్యాక్టరీ ఉన్నది. రాత్రి పదిన్నర అయినా మంటలు ఆరిపోలేదు.

ఆఫ్యాక్టరీ ప్రక్క ఆవరణలో ఉన్న పత్తి కేళ్ళకుకూడా నిప్పు అంటుకోకుండా అంక్లేశ్వర్ పురపాలక సంఘ ఆధ్వంలోగల కొద్దిపాటి అగ్నిప్రమాద నివారణ యంత్రాలు ప్రయత్నించినవి.

నర్మదానదిపై వంతెనను మరమ్మతు చేయడానికి మూసివేశారు. అందువల్ల బ్రోచ్ పట్టణంనుంచి అగ్నిప్రమాద నివారణ యంత్రాలను అంక్లేశ్వర్‌కు తీసుకువెళ్ళే అవకాశం లేకపోయింది. ప్రాణనష్ట మేమీ లేదు. అగ్ని ప్రమాదం ఎట్లా జరిగినదీ ఇంకా తెలియలేదు.

## ఆంధ్రరైతు యాత్రాదళం ఢిల్లీ రాక

న్యూఢిల్లీ, ఏప్రిల్ 10: దేశంమొత్తంమీద అమలు అవుతున్న అభివృద్ధి ప్రణాళికలు చూడడానికి, ఆంధ్ర రాష్ట్రంనుంచి బయలుదేరిన 600 మంది రైతు యాత్రికులు ఆగ్రానుంచి యివాళ యిక్కడికి వచ్చారు.

జట్లు జట్లుగా పార్లమెంటు భవనానికివచ్చి, పార్లమెంటు సమావేశాలను చూచారు. ఇక్కడినుంచి ఋషీకేశ్ వెళ్లారు.













# నేపాల్ కమ్యూనిస్టు పార్టీ

## నిషేధం తొలగించమని విజ్ఞప్తి

ఖట్మండు, ఏప్రిల్ 10: కమ్యూనిస్టు పార్టీ సానుభూతిపరులు కొంతమంది నేపాల్ ప్రధాన మంత్రి శ్రీ టంకా ప్రసాద్ ఆచార్యను నిన్న కలుసుకొని కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని తొలగించవలసిన అవసరం వివరించారు. కమ్యూనిస్టు పార్టీపై నిషేధాన్ని తొలగించే వ్యవహారాన్ని రెండు నెలల్లో పరిశీలిస్తానని ప్రధాన మంత్రి ఈరాయబారవర్గానికి చెప్పారట. ఆ విధంగా లిఖిత హామీ ఇవ్వమని రాయబార వర్గం కోరగా అట్లా వ్రాసి ఇవ్వడానికి ప్రధానమంత్రి నిరాకరించారని తెలిసింది.

నిషేధాన్ని కమ్యూనిస్టుపార్టీ ధిక్కరించి ఖట్మండు తదితర ప్రదేశాల్లో ఈనెల 16, 17 తేదీలలో బహిరంగ సభల నేర్పాటు చేస్తుందంటూ కరపత్రాలు పంచిపెట్టారు.

నిషేధాజ్ఞలను ధిక్కరిస్తే సహించేది లేదని చట్టం ప్రకారం చర్య తీసుకుంటామని యీ రాయబార వర్గానికి ప్రధానమంత్రి చెప్పారట.

## నేపాల్‌తో రష్యా రాయబార సంబంధాలు

ఖట్మండూ, ఏప్రిల్ 10: భారత దేశంలోని రష్యా రాయబార కార్యాలయంనుంచి రష్యా రాయబారశాఖ ఉద్యోగి ఒకరు ఈనెల 15వ తేదీ ఇక్కడికి రానున్నారని అధికార రీత్యా నేడు తెలిసింది.

ఈ ఉభయదేశాల మధ్య రాయబార సంబంధాలు నెలకొల్పాలని రష్యా ప్రతిపాదించిన సంగతి తనకు తెలియదని నేపాల్ ప్రధానమంత్రి శ్రీ టంకా ప్రసాద్ ఆచార్య అన్నారు. రష్యా ప్రభుత్వం చేసిన ప్రతిపాదన సందర్భంలోనే ఇప్పుడు ఈ ఉద్యోగి వస్తున్నాడా అని ప్రశ్నించగా "నాకు తెలియదు" అన్నారు శ్రీ ఆచార్య.

రష్యా ప్రభుత్వ రాయబారశాఖ ఉద్యోగి ఈ దేశం రావడం ఇదే మొదటిసారి. ఈ రాకకు ప్రాముఖ్యం లేకపోలేదని అభిజ్ఞవర్గాలు అంటున్నారు. నేపాల్ అభివృద్ధి కార్యక్రమాలకు రష్యా చేయగల సహాయం విషయమై ఈ దేశ ప్రభుత్వ అభిప్రాయం తెలుసుకోడానికి ఆయన ప్రయత్నిస్తాడేమో నంటున్నారు.

చైనా, రష్యాలలో సహా మిత్రదేశాలన్నింటినుంచి షరతులు, నిర్బంధాలు లేకుండా నేపాల్ సహాయం తీసుకొంటుందని రెండున్నర నెలలకిందట పదవి స్వీకరించిన తరువాత మొట్టమొదటి పత్రికావిలేఖరుల సమావేశంలో నేపాల్ ప్రధానమంత్రి అన్నారు.

## సహగమనంలో సహాయం: 8 మంది అరెస్టు

గ్వాలియర్, ఏప్రిల్ 10: ఇక్కడికి 180 మైళ్ళలో మొరీన జిల్లాలోని షియాపూర్‌లో కిందటి శనివారం ఒక స్త్రీ "సతీ సహగమనం" చేయడానికి సహాయపడిన నేరానికి 8 మందిని పోలీసులు అరెస్టుచేశారని ఇక్కడికి వార్త వచ్చింది. సహగమనం చేసిన స్త్రీకి రెండున్నర సంవత్సరాలబిడ్డ ఉన్నదట.

# శ్రీలంకని భయపెట్టడానికి "నెహ్రూ బూచి"

## బ్రిటిషు పత్రికల దుష్ప్రచారంపై విమర్శ

కొలంబో ఏప్రిల్ 11: శ్రీలంక (సింహళం) ఎన్నికల ఫలితాలపై వ్యాఖ్యానిస్తూ కొలంబో పత్రిక "మార్నింగ్ టైమ్స్" శ్రీ లంకని భయపెట్టడం బ్రిటన్ తరం కాదనీ, శ్రీ లంకని కొనెయ్యడానికి అమెరికన్ డాలర్ల తరం కాదనీ సంపాదకీయం వ్రాసింది.

ఎన్నికల ధోరణిమానీ బ్రిటన్‌లో పత్రికలు కలవరపడుతూ దుష్ప్రచారం ప్రారంభించాయి. "శ్రీ లంకని కబళించడానికి సిద్ధంగా వున్న నెహ్రూ బూచిని చూపించి శ్రీ బండారనాయకని భయపెట్టాలని సూచిస్తూ బ్రిటిష్ పత్రికలు బ్రిటిష్ కామన్వెల్తు మంత్రి వెంటనే కొలంబో వెళ్ళాలని సలహా ఇచ్చాయి. ఈ ప్రచారాన్ని కొలంబో "మార్నింగ్ టైమ్స్" తీవ్రంగా ఖండించింది.

ఈ ఫలితాలకు శ్రీ కొటెలవాలా ప్రభుత్వంపై శ్రీ లంక ప్రజల ఆగ్రహమే కారణం అని చెపుతూ, ఆ ఆగ్రహానికి గల కారణాలను ఈ పత్రిక విశదీకరించింది.

శ్రీ లంక పేరుకి మనీలాకూటంలో చేరకపోయినా చేరినట్లే ప్రభుత్వం వ్యవహరించిందని ఈపత్రిక వ్రాసింది.

ఇండో చైనాకు ఫ్రెంచి సైనికులను తీసుకు వెళ్లిన అమెరికన్ విమానాలను కొలంబో విమానాశ్రయాన్ని వినియోగించుకో నిచ్చారు. సింహళంలో విదేశీ సైనిక స్థావరాలను ఏర్పరచుకో నిచ్చారు.

అమెరికా ఇప్పుడు ఆర్థిక సహాయం ఇవ్వడానికి నిరాకరిస్తే, నిర్భయంగా శ్రీ లంక స్వయం కృషిపైనే ఆధారపడుతోంది. అంటే డాలర్లతో ఆత్మగౌరవం కొనుక్కోవటం లేదు అని ఈ పత్రిక వ్రాసింది.

## భూపాల్‌లో మళ్ళీ నిషేధాజ్ఞలు

భూపాల్, ఏప్రిల్ 10: భూపాల్‌లో నేటి రాత్రి 9 గంటల నుంచి వేకువ జామున 5 గంటలవరకు "కర్ఫ్యూ" నిబంధనలను ఈవేళ మళ్ళీ అమలు చేశారు.

శనివారం ఇక్కడ జరిగిన మతకలహాల కారణంగా యీ నిషేధ నిబంధనలను అమలు చేశారు. అప్పటినుంచి నిబంధనలు అమలులోఉండే కాలాన్ని మెల్లిగా తగ్గించుతూ వస్తున్నారు. అయితే నేటి రాత్రి మాత్రం అట్లా తగ్గించలేదు.

"నగరం ప్రశాంతంగా ఉన్నది. దుకాణాలు, అంగళ్లు తెరిచారు." అని నేడు వెలువడిన ప్రభుత్వ ప్రకటనలో ఉన్నది.

# బెంగాల్ బీహార్ విలీన తీర్మానం

## రాజ్యాంగ విరుద్ధమంటూ హైకోర్టులో దావా

కలకత్తా, ఏప్రిల్ 10: బెంగాల్ బీహార్ రాష్ట్రాలను విలీనం చేయాలని ముఖ్యమంత్రి డా॥ బి. సి. రాయ్ పశ్చిమ బెంగాల్ శాసనసభలో ప్రవేశపెట్టిన తీర్మానం రాజ్యాంగ విరుద్ధం అంటూ పలుగురు బెంగాలీలు కలకత్తా హైకోర్టులో దావా తెచ్చారు.

ఈ తీర్మానాన్ని పశ్చిమ బెంగాల్ శాసనసభలో ప్రవేశపెట్టకుండాముఖ్యమంత్రినీ, సభాపతినీ, విలీనానికి ఎటువంటి చర్యా తీసుకోరాదని భారత ప్రభుత్వాన్ని నిషేధిస్తూ ఆజ్ఞ యివ్వవలసిందని వాదులు పలుగురూ హైకోర్టులో న్యాయమూర్తి శ్రీ సిన్హాను అర్థించారు. కేసు ఏప్రిల్ 12వ తేదీ విచారణకు వస్తుంది.

## 60 వేల ఏళ్లనాటి మానవులు

మైసూరు, ఏప్రిల్ 9: తుంకూరు జిల్లాలో బావసాంద్రకోంపల ప్రాంతంలో కొన్ని పరికరాలు దొరికాయి. వీటినిబట్టి మైసూరులో మొదట మానవుడు దాదాపు 50, 60 వేల సంవత్సరాల పూర్వం ఉండేవాడని మైసూరు పురాతత్వశాఖ డైరెక్టర్ డాక్టర్ యమ్. శేషాద్రి తెలియజేశారు.

ఈ విధంగా లభ్యమైన వస్తువుల్లో చిన్న చేతిగొడ్డళ్లు, గుండ్రని శిలాస్ఫటికాలు ఉన్నాయి.

## మైసూరు మంత్రి ఎన్నికల దరఖాస్తు

బెంగుళూరు, ఏప్రిల్ 10: మైసూరు రాష్ట్ర పరిశ్రమలశాఖ మంత్రి శ్రీ హెచ్. ఎమ్. చెన్న బసప్ప పెట్టుకున్న 'రిట్' దరఖాస్తును మైసూరు హైకోర్టు నేడు తోసివేశారు. పెరియపట్టణం నియోజకవర్గంనుంచి శాసనసభకు శ్రీ చెన్నబసప్ప లోగడ ఎన్నికైనారు. ఆ యెన్నిక చెల్లదని ఎన్నికల వివాదాల న్యాయస్థానం ఇటీవల తీర్పు చెప్పిన సంగతి పాఠకులకు తెలిసినదే. ఎన్నికల న్యాయస్థానం తీర్పును రద్దు చేయమని కోరుతూ ఇప్పుడు శ్రీ చెన్నబసప్ప హైకోర్టులో 'రిట్' దరఖాస్తు పెట్టుకున్నారు.

ఈ దరఖాస్తుపై హైకోర్టు చెప్పిన తీర్పులో రెండంటే రెండే వాక్యాలున్నవి. దరఖాస్తుదారు తరఫున న్యాయవాది వాదాన్ని కొనసాగించ దలచటం లేదని మాత్రమే తీర్పులో ఉన్నది.

అసలు దరఖాస్తును విరమించుకోడానికి అనుమతించమని అంతకుముందు దరఖాస్తుదారు తరఫు న్యాయవాది కోర్టును అభ్యర్థించారు.

## మద్రాసులో హానిమన్ వర్ధంతి

మద్రాసు, ఏప్రిల్ 10: హోమియో వైద్యవిధాన వ్యవస్థాపకులు శ్రీ హానిమన్ 118వ వర్ధంతి సభ తిరువత్తియూరు హైరోడ్డు సందు సూరజ్ ఫార్మసీలో నేడు జరిగింది. శ్రీ చిలుపూరి మార్కండేయకవి అధ్యక్షత వహించారు. శ్రీ డి. సూర్యభగవానులు ప్రసంగిస్తూ శ్రీ హానిమన్ జీవితచరిత్రను, హోమియో వైద్యవిశిష్టతను వివరించారు. అధ్యక్షులు మాట్లాడుతూ శాస్త్రీయ ఔషధముల ప్రాముఖ్యం నాటని వుపయోగించే వారు అనుసరించాల్సిన విధానం గురించి మాట్లాడారు. మన దేశ పరిస్థితులకు హోమియో వైద్యవిధానం తగివున్నదని అధ్యక్షులు చెప్పారు. తరువాత అతిథి సత్కారం జరిగింది.

# స్వతంత్ర దేశాల నిరీక్షణ

## టునీషియా ప్రధానికి శ్రీ నెహ్రూ సందేశం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 10: టునీషియా వంటి, ఆసియా ప్రజలకు స్వాతంత్ర్య మిచ్చే సుదినంకోసం స్వతంత్ర దేశాలన్నీ ఎదురు చూస్తున్నవని భారతదేశం, టునీషియా దేశాలమధ్య పరస్పర సహకారంకోసం ఎదురు చూస్తున్నామని ఆ దేశం ప్రధానమంత్రికి శ్రీ నెహ్రూ సందేశం పంపించారు. టునీషియా స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంలో ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ఈ సందేశం పంపించారు.

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం దీక్ష వహించిన భారతదేశంతో సన్నిహిత సంబంధాలు నెలకొల్పుకోవాలని ఆశిస్తున్నామని భారత ప్రధానికి టునీషియా ప్రధానమంత్రి పంపించిన సమాధానంలో ఉన్నది.

## ఆదర్శవంతమైన ఆంధ్ర హైకోర్టు

### శ్రీ విశ్వనాథశాస్త్రి ఆశాభావం

గుంటూరు, ఏప్రిల్ 9: హైకోర్టు తాత్కాలిక న్యాయమూర్తి శ్రీ విశ్వనాథశాస్త్రి గౌరవార్థం న్యాయవాద సంఘం నిన్న రాత్రి విందుచేశారు. న్యాయమూర్తులు, పలువురు న్యాయవాదులు, వచ్చారు.

శ్రీ దువ్వూరి నరసరాజు మాట్లాడుతూ శ్రీ విశ్వనాథశాస్త్రి ప్రతిభా విశేషాల నుగ్గడించారు. మరి కొంతకాలం వీరు యీ పదవిలో వుండాలని ఆశిస్తున్నామన్నారు.

శ్రీ శాస్త్రి సమాధానమిస్తూ ఆంధ్ర హైకోర్టు దేశానికిఆదర్శప్రాయం కాగలదనిజూనియర్ న్యాయవాదులవాదనలను వింటున్నప్పుడు తనకట్టి అభిప్రాయం కలుగుతోందని చెప్పారు. ఆంధ్రులు ఆవేశపూరితులనీ, స్వాతంత్ర్య సమరంలో ఆశేషత్యాగాలు చేశారనీ అన్నారు. స్వేచ్ఛ, నిష్పాక్షికం, అలవర్చుకుంటే రాణించగలరని న్యాయవాదుల నుద్బోధించారు.

## యానాంలో విద్యుద్దీపాలు

### శ్రీ అమీర్ మహమ్మద్‌చే ప్రారంభోత్సవం

యానాం, ఏప్రిల్ 10: మొన్న సాయంకాలం శ్రీ అమీరుమహమ్మద్ విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం చేశారు.

పన్నెండుమైళ్ళలోఉన్న ద్రాక్షారామంనుంచి, యిక్కడికి విద్యుచ్ఛక్తి తీగలు వేశారు. పని మూడుమాసాల 15 రోజులలో పూర్తిఅయింది. ఈ పని నిర్వహించిన రామచంద్రపురం అసిస్టెంటు ఇంజనీరు శ్రీ ఎ.ఆర్. శాస్త్రి, కాకినాడ అసిస్టెంటు ఇంజనీరు శ్రీ మదన్ మోహన్, యానాం ఎలెక్ట్రికల్ సూపర్వైజరు శ్రీ ఆర్. వి. ఎస్. బి. వెంకట్రావు ప్రభృతులు యీ ఉత్సవంలో పాల్గొన్నారు.

## తాలూకా గ్రామోద్యోగ మహాసభ

ఆళ్ళగడ్డ, ఏప్రిల్ 7: శిరువెళ్ళ తాలూకా గ్రామోద్యోగులు శ్రీ జె. తిమ్మారెడ్డి అధ్యక్షతన సమావేశమై యీ నెల ఆఖరు వారంలో గ్రామోద్యోగ మహాసభ జరపాలని నిర్ణయించారు. మంత్రులు శ్రీ ఓబులరెడ్డి, శ్రీ చంద్రమౌళి, శ్రీ కళా వెంకట్రావు, లను ఆహ్వానించాలని నిశ్చయించారు. ఆహ్వాన సంఘం అధ్యక్ష కార్యదర్శులుగా శ్రీ జి. ఓబులరెడ్డి శ్రీ కె. ఆర్. వెంకట్రావులను ఎన్నుకున్నారు.

సమావేశంలో శ్రీ యల్. వి. సుబ్బారెడ్డి, శ్రీ టి. శ్రీనివాసాచార్యులు ప్రసంగించారు.

# తిరుపతిలో వేదవిద్యా శిక్షణ

## పాఠ్యాంశాల ఆమోదం కోసం యత్నం

తిరుపతి, ఏప్రిల్ 11: వేదవిద్యా శిక్షణ తరగతులకు ఇప్పుడు తయారు చేసిన పాఠ్యాంశాలను శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం, తదితర దక్షిణ భారత విశ్వవిద్యాలయాల ఆమోదానికి పంపించాలని శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య విద్యా పరిశోధన కేంద్రాన్ని సంస్కరించేందుకు నియమించిన సంఘం తిరుమలలో నిన్న జరిగిన సమావేశంలో నిర్ణయించారు. ఈ సంఘానికి దేవాదాయ, ధర్మాదాయశాఖ మంత్రి శ్రీ కె. చంద్రమౌళి అధ్యక్షుడు.

సమావేశానికి డాక్టరు వి. రాఘవన్, శ్రీయుతులు వి. సుబ్బారావు, వేదాంతం జగన్నాథాచార్యులు, ఎస్. టి. జి. వరదాచార్యులు, మదన్మోహన్ విద్యాసాగర్, ఆర్. వెంకటరెడ్డి, కె. చెన్నారెడ్డి, సి. అన్నారావుగారలు వచ్చారు. డిగ్రీ కోర్సులలోను, ప్రాచ్య విద్యల డిగ్రీ తరగతులలోను వేదవిద్యను కూడా చేర్చి ప్రోత్సహించమని భారతీయ విశ్వవిద్యాలయాలన్నింటిని కోరుతూ ఒక తీర్మానం చేశారు. శ్రీ వెంకటేశ్వర ప్రాచ్య విద్యా పరిశోధన కేంద్రం సంస్కరణకు తిరుపతి దేవస్థానం ధర్మకర్తలు కోరిన ప్రకారం డబ్బు ఇవ్వాలని మరో తీర్మానంలో నిర్ణయించారు.

## కావలివద్ద లారీక్రింద పడిన మనిషి మరణం

కావలి, ఏప్రిల్ 10: మొన్నరాత్రి యిక్కడికి మైలుదూరంలో ట్రంకు రోడ్డుమీద కట్టెలబండి వెనుక వస్తున్న ఏలూరుపాడు వాస్తవ్యుడు పల్లాపుల బంగారు అను 25 ఏళ్లవ్యక్తి లారీక్రింద పడి మరణించాడు. లారీ వెనుకనుంచి గుద్దుకొనుటవలన, లారీకి కట్టెలకును మధ్య చిక్కుకొని చనిపోయాడు. డ్రైవరు లారీని ఆరుమైళ్ళ దూరం తోలుకొనిపోయి గౌరవరంవద్ద లారీని విడిచి పారిపోయినాడని తెలిసింది. కావలి పోలీసులు లారీని పట్టుకొని, డ్రైవరును అరెస్టుచేశారు.

## సభలు–సమావేశాలు

శ్రీ కాకుళంజిల్లా అభివృద్ధి మహాసభ యీ నెల 21 తేదీన నరసన్నపేటలో శాసన సభ్యులు శ్రీ సిమ్మా జగన్నాథం అధ్యక్షతన జరుగుతుంది. ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, సభను ప్రారంభించుతారు.

రాయదుర్గం తాలూకా ప్రాథమికోపాధ్యాయ ప్రథమ మహాసభ ఈనెల 14, 15 తేదీలలో రాయదుర్గంలో జరుగుతుందని శ్రీ యన్. సి. శేషాద్రి తెలియజేస్తున్నారు.

# జెనీవా ఒప్పందానికి దక్షిణ వియత్నాం పాటింపు అనవసరం

## రష్యాకు బ్రిటన్ సందేశం

లండన్, ఏప్రిల్ 10: ఇండో-చైనా యుద్ధవిరమణకు జెనీవాలో జరిగిన ఒప్పందాలను దక్షిణ వియత్నాం పాటించ నక్కరలేదని తాము భావిస్తున్నట్లు బ్రిటన్ రష్యాకు తెలియజేసింది. జెనీవా ఒప్పందం ఉత్తర, దక్షిణ వియత్నాంలు రెండింటికీ కలిపి ఎన్నికలు జరిపి దేశాన్ని ఏకం చేయాలని నిర్దేశిస్తున్నది. బ్రిటిష్ సందేశం ఇటీవల మాస్కోకు పంపించారు.

దక్షిణ వియత్నాంలో సైనిక బలం పెంచటం జరుగుతున్నదనే సోవియట్ ఆరోపణను బ్రిటన్ ఈ సందేశంలో ఖండించింది. ఉత్తర వియత్నామే తన సైన్యాన్ని 7 డివిజన్ల నుంచి 20 డివిజనులకు పెంచిందని బ్రిటన్ ఎదురు ఆరోపణ చేసింది.

జెనీవా ఒప్పందంలో వియత్నాం తాత్కాలికంగా 17వ అక్షాంశ రేఖ వెంట విభజింపబడ్డది. ఉత్తర వియత్నాం తరఫున వియత్ మిన్ ప్రభుత్వం ఇతర ప్రాంతం తరఫున ఫ్రాన్సు ఈ ఒప్పందంపై సంతకాలు చేసినవి. ఒప్పందం చెప్పినట్లు ఏకీకరణకు ఎన్నికలు జరిపేందుకు దక్షిణ వియత్నాం నిరాకరిస్తున్నది.

## సంప్రదింపులు విఫలం అయ్యే అవకాశం

ఇండో చైనా ఒప్పందం అమలు విషయమై చర్చించేందుకు జెనీవా సమావేశపు సహాధ్యక్షులయిన బ్రిటన్ రష్యాలు త్వర ఇండో చైనా పర్యటన సంఘాలను [illegible] ప్రతిపాదనలను ఇక్కడి సంప్రదింపులు ప్రారంభిస్తున్నవి. ఈ సమావేశంలో బ్రిటన్ అనుసరించబోయే వైఖరి వీనిలో వ్యక్తమైన సందేశం సూచిస్తున్నది.

# అవిసెనూనె ఆముదంపై ఎగుమతి సుంకం

## వృద్ధి చేయాలని నిర్ణయం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 10: అవిసెగింజల నూనెపై టన్నుకు రు 250 ఎగుమతి సుంకం విధించాలని భారతప్రభుత్వ వాణిజ్య-పరిశ్రమలశాఖ నిర్ణయించారు. ఆముదంపై ఎగుమతి సుంకాన్ని టన్నుకు రు 125 నుంచి రు 175 కు పెంచాలని కూడా నిర్ణయించారు.

సైర్ విత్తులనూనె, కర్డీ విత్తుల నూనెపై టన్నుకు రు 200 ఎగుమతి సుంకం విధించాలని కూడా నిర్ణయించినట్లు భారత ప్రభుత్వ వాణిజ్య-పరిశ్రమలశాఖ నేడు చేసిన ప్రకటనలో ఉన్నది. నూనెలు, నూనెగింజల ప్రస్తుత ధరలను పరిశీలించి ఈ నిర్ణయాలను చేశారు. ఇవి వెంటనే అమల్లోకి వస్తవి.

## రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్

కాత్రిఢిల్లీ, ఏప్రిల్ 10: పంజాబ్ పెప్సూ రాష్ట్రాలలో రెండు రోజుల పర్యటన పూర్తిచేసుకొని రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ నేడిక్కడికి తిరిగి వచ్చారు.

పాటియాలా నుంచి తిరిగివస్తూ రాజపురాలోని కస్తూర్బా సేవామందిరాన్ని రాష్ట్రపతి చూచారు. సేవా మందిరం ఏర్పాటు చేసిన విద్యా శిక్షణాలయానికి రాష్ట్రపతి శంకుస్థాపన చేశారు.

# కచ్ ఉత్తర ప్రాంతం పాకిస్తాన్‌దట

## తమకు రావాలని భారత ప్రభుత్వానికి లేఖ

కరాచీ, ఏప్రిల్ 10: కచ్‌జాదుల భూములలో ఉత్తర ప్రాంతం తమకు రావాలంటూ పాకిస్తాన్ ప్రభుత్వం భారతదేశానికి వ్రాసిందని అభిజ్ఞవర్గాలద్వారా నేడిక్కడ తెలిసింది.

పాకిస్తాన్ ప్రభుత్వం వ్రాసిన ఈ జాబును నేడు భారత ప్రభుత్వానికి అందచేశారట. భారతదేశ ప్రాంతమైన కచ్‌జాదుల భూములలోకి పాకిస్తానీయులు తరచుగా అతిక్రమణలు జరుపుతున్నారని 1955 మేలో భారత ప్రభుత్వానికి వ్రాసిన జాబుకు ఈవేళ పాకిస్తాన్‌నుంచి సమాధానం వచ్చిందట. అంటే 11 నెలల తరువాత సమాధానం వచ్చిందన్నమాట. సింధు కచ్చిరాష్ట్రాల సరిహద్దులను 1924 లో అప్పటి ప్రభుత్వం నిర్ణయించింది. ఆ సరిహద్దుల ప్రకారం కచ్‌జాదుల భూములన్నీ ఇప్పటి భారతదేశ ప్రాంతాలేనని భారతప్రభుత్వం 1955 మేలో వ్రాసిన జాబులో పాకిస్తాన్‌కు వివరించింది.

## గంటల పంచాంగం

శ్రీ దుర్ముఖి సం॥ చైత్ర శు॥ చతుర్థి 1956- సం॥ ఏప్రిల్ 14 శనివారం శు॥ చతుర్థీ రా 0.42 కృత్తిక 8-29 వర్జ్యం 28.82 ల రా 1-2 కు.
శు॥ పంచమి ఏప్రిల్ 15 ఆదివారం శు॥ పంచమి 12-28 రోహి 7-8 వర్జ్యం 12-18 ల 13-48 కు.

ఆంధ్రపత్రిక

ఒరు శేయమి యొసరించిన
వరవర యుప్రియము తన మనంబున కగు దా
వొరులకు పనిసేయకునికి
పరాయణము పరమధర్మపథములకెల్లన్
(మహాభారతము)

శ్రీ దుర్ముఖి సం॥ చైత్ర శు॥ చతుర్థి
శని.వారం

## సముచిత నిర్ణయం

రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ బిల్లును అవసరమైన సవరణలతో హైదరాబాద్ శాసనసభ కూడా ఆమోదించింది. ఆంధ్ర, హైదరాబాద్ శాసనసభలు రెండూ దీన్ని ఆమోదించడంతో కొత్త రాష్ట్రానికి వుండవలసిన పేరు విషయంలో ఏర్పడిన అభిప్రాయభేదం సులభంగానే సర్దుబాటై పోయింది. పేరు మీద కొంత అభిప్రాయభేదం వున్నదని తోచినందువల్లనే కేంద్ర ప్రభుత్వం బిల్లులో ఇదమిత్థమని నామకరణమేదీ చేయకుండా 'ఆంధ్ర తెలంగాణా' అని మాత్రమే ఉదహరించింది. తగిన పేరు నిర్ణయించే బాధ్యతను ఉభయ రాష్ట్రాల విచక్షణకే వదలి వేసింది. కొత్త రాష్ట్రానికి ఏ పేరు వుండాలనే అంశంమీద అసలు అభిప్రాయభేదమే రావలసింది కాదు. 'ఆంధ్ర తెలంగాణా' అనే పేరు అపభ్రంశంగా వుందని ఎవ్వరైతే విమర్శించారో, సవ్యమైన పేరును శీఘ్రంగా నిర్ణయించుకోవలసిన బాధ్యత అప్పుడే మనమీద పడ్డది.

రాష్ట్ర శాసనసభలో బిల్లును ప్రవేశపెడుతూ తాము ప్రతిపాదించిన సవరణలలో హైదరాబాద్ ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావు గారు ఇతర విషయాలను ప్రస్తావించారుగాని, కొత్త రాష్ట్రం పేరు ప్రస్తావనను మాత్రం తీసుకురాలేదు. శాసనసభ్యుల యుక్తాయుక్తవిచక్షణకే దాన్ని వదలివేశారు. చర్చ సందర్భంలో కాంగ్రెసు సభ్యులు, ప్రతిపక్షంవారు కలసి చేసిన సవరణను సభవారు ఐక్యకంఠంతో ఆమోదించారు.

ఆంధ్ర, తెలంగాణా అన్నవి ఒకే భాష, ఒకే సంస్కృతి, ఒకే విధమైన ఆచార వ్యవహారాలు కలిగిన తెలుగు ప్రజాబాహుళ్యాన్ని చీలదీయడానికి ఏర్పడిన కృత్రిమ సరిహద్దులు. మూడుకోట్ల తెలుగు ప్రజల ఆర్థిక, సాంఘిక అభ్యున్నతిని కాంక్షించే విజ్ఞులెవరూ ఈ కృత్రిమ సరిహద్దుల వాదనను పాటించరు.

కొత్త తెలుగు రాష్ట్రానికి పేరు నిర్ధారణ అయింది కాబట్టి, కేంద్ర ప్రభుత్వం రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లు తుది స్వరూపంలో ఆంధ్ర ప్రదేశ్ అనే పేరునే నిరాక్షేపణీయంగా సమ్మోదుచేస్తుంది. ఈ వ్యవహారాన్ని సంపూర్ణ సామరస్యంతో నిర్ణయించి, అభిప్రాయభేదాన్ని ఆదిలోనే జయప్రదంగా అరికట్టినందుకు హైదరాబాద్ నాయకులు, ప్రతిపక్ష అధికారపక్ష శాసనసభ్యులు అభినందనీయులు. శాశ్వతంగా వుండవలసిన పేరు విషయంలో సువిధంగా సంపూర్ణ ఏకీభావంతో ఉభయత్రా సముచితమైన, ప్రజాస్వామ్య సూత్రబద్ధమైన నిర్ణయం జరగడం నూతన రాష్ట్ర భవిష్యదభివృద్ధికి అత్యంత శుభ సూచకమనే విశ్వసించవచ్చు.

ఇతర సవరణలతోపాటు బొంబాయి నగరాన్ని మహారాష్ట్రలో చేర్చాలని ప్రతిపక్ష సభ్యులు ప్రవేశపెట్టిన ప్రతిపాదనను కూడా హైదరాబాద్ శాసనసభ ఆమోదించింది. కాంగ్రెస్ పక్షంలోని మహారాష్ట్ర సభ్యులు ఓటుచేయక తాటస్థ్యభావాన్ని ప్రదర్శించడంవల్లనే ఈ ప్రతిపాదన నెగ్గింది. బొంబాయి నగరసమస్యపై మహారాష్ట్రులు ఇంతటి స్థిరవైఖరి అవలంబించడాన్ని తప్పుగా భావించవలసిన పని లేదు.

సంయుక్త మహారాష్ట్ర నాయకుడు శ్రీ శంకరరావ్ దేవ్ చెప్పినట్లు ఈ సమస్యాపరిష్కార బాధ్యతను ప్రధాని నెహ్రూకు వదలి వేయడమే ఉత్తమం. శీఘ్రమే గాకపోయినప్పటికీ, ఉత్తరోత్తరా అయినా ఈ క్లిష్ట సమస్యను యుక్తాయుక్త పరిజ్ఞానంతో సమంజసంగా, న్యాయబద్ధంగా పరిష్కరించగలిగిన నాయకుడు ప్రధాని నెహ్రూయే నన్న విషయాన్ని మహారాష్ట్ర సోదరులు మరువకూడదు.

## విద్యాతురాణాం న సుఖం న నిద్రా

### కైకలూరులో శ్రీ సంజీవయ్య ప్రసంగం

కైకలూరు, ఏప్రిలు 8: విద్యార్థులు బాగా చదివి, ప్రావీణ్యాన్ని సంపాదించి ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణులు కావాలి. "విద్యాతురాణాం న సుఖం న నిద్రా" అని మంత్రి శ్రీ డి. సంజీవయ్య నిన్న ఉన్నతపాఠశాల రజతోత్సవంలో ప్రసంగిస్తూ అన్నారు. రజతోత్సవసభకు శ్రీ యార్లగడ్డ శివరామ ప్రసాద్ అధ్యక్షత వహించారు. అతిథులకు రజతోత్సవ సంఘాధ్యక్షులు శ్రీ కె. అప్పారావు స్వాగతం చెప్పారు.

శ్రీ సంజీవయ్య యిలా అన్నారు: విద్యావిధానంలో మార్పు తీసుకురావడానికి, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు అనేకవిధాలుగా కృషి చేస్తున్నారు. విద్యార్థులు చాల కష్టపడి చదవాలి. చదవండి పెద్దవాళ్లు కాలేరు. విద్య కావాలనుకున్నవాడు, నిద్రగాని, సుఖాన్నిగాని కావాలని కోరరాదు. "విద్యాతురాణాం న సుఖం న నిద్రా".

అనంతరం ప్రధానోపాధ్యాయుడు శ్రీ వై. గోపాలకృష్ణయ్య పాఠశాలా నివేదికను సమర్పించారు. శ్రీమతి కె. సుబ్రహ్మణ్యేశ్వరి, (అంగలూరు ప్రభుత్వోన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయిని) రజతోత్సవ సంచికను ఆవిష్కరించారు.

శ్రీ మల్లిపూడి రాజేశ్వరరావు, శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్య కూడా ఉపన్యసించారు.

రాత్రి విద్యార్థులు, ఉపాధ్యాయులు పాండవోద్యోగ విజయం, రిక్షావాడు, ఆచార్య, ప్రతీకారం, ఉత్తరరామ చరిత్ర, కొంటె కృష్ణయ్య ఆదిగా మొదలైన నాటికలు విచిత్రవేషాలు ప్రదర్శించారు.

మధ్యాహ్నం శ్రీ జంపటి పురుషోత్తం అధ్యక్షతన "విద్యా ప్రమాణములు తగ్గుటకు, కారణములు, - వాటి నివృత్తి మార్గములు" పై విద్యావిషయిక చర్చ జరిగింది. శ్రీ ఎ. సత్యనారాయణ, శ్రీ సి. రామలింగమూర్తి, శ్రీ మాచిరాజు సత్యనారాయణ, శ్రీమతి కె. సుబ్రహ్మణ్యేశ్వరి ప్రసంగించారు.

శ్రీమతి చేబ్రోలు హరికథా గానం చేశారు.

## కంభం చెరువు మరమ్మతు

కర్నూలు, ఏప్రిల్ 11: కంభం చెరువు పూడిక తీసేందుకు పథకాన్ని తయారుచేయవలసిందిగా చీఫ్ ఇంజనీరును కోరుటకు భూసార రక్షణ సంఘం, నిన్నటి సమావేశంలో నిర్ణయించింది. సమావేశానికి రాష్ట్ర వ్యవసాయ మంత్రి భూసార రక్షణ పథకాలు త్వరగా అమలుజరిగేందుకు మార్గాలు సూచించడానికి ఒక ఉపసంఘాన్ని కూడా నియమించారు.

# రాజమండ్రిలో పుష్కరాల ఏర్పాట్లు

## స్వచ్ఛంద సేవకులుగా విద్యార్థుల సహాయం తీసుకోవాలని సలహా

రాజమండ్రి, ఏప్రిల్ 11: గోదావరి పుష్కరాలకు రాజమండ్రికి వచ్చే లక్షలాది యాత్రికుల స్నానసౌకర్యాలూ-బసల వసతులూ-నీటివసతి ప్రజారోగ్య రక్షణ-జనరద్దీ బందోబస్తు వగైరా పరిశీలించే నిమిత్తం, స్థానిక సంస్థల మంత్రి డాక్టర్ అంబటిపూడి బాలనాగేశ్వరరావు, ప్రజారోగ్యశాఖ డైరెక్టర్ డాక్టర్ దిగవల్లి సుబ్బారావు నిన్నవచ్చి నగరంలో వేర్వేరు ప్రాంతాలను పరిశీలించారు. గోదావరి గట్టున ప్రభుత్వం ఖాళీచేయిస్తున్న పాకలనూ, గోదావరి-రాజమండ్రి స్టేషన్లవద్ద యాత్రికులకోసం షెడ్లు వేస్తూవున్న స్థలమూ, పుష్కరశిబిర ప్రదేశము పరిశీలించారు.

### పుష్కర సంఘం

సాయంత్రం పుష్కర సంఘ సమావేశం కలెక్టరు శ్రీ ఎ. కృష్ణస్వామి అధ్యక్షతన జరిగింది. డాక్టరు నాగేశ్వరరావు, ప్రజారోగ్య శాఖ డైరెక్టరు డాక్టరు దిగవల్లి సుబ్బారావు, జిల్లా వైద్యాధికారి డాక్టరు కె. చంద్రరావు, జిల్లా పోలీసు సూపరింటెండెంటు శ్రీ ఎల్. జె. విక్టర్, పురపాలక సంఘాధ్యక్షులు శ్రీ పోతుల వీరభద్రరావు, ప్రజారోగ్య శాఖ సహాయ డైరెక్టర్ డాక్టర్ ఎనమండ్ర సుబ్రహ్మణ్యం, జిల్లా ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ చంద్రశేఖరరావు, డాక్టర్ కోలేటి కనకరాజు, కమీషనర్ శ్రీ జి. నరసింహస్వామి, ఆరోగ్యాధికారి డాక్టర్ సీతారాజు లక్ష్మణసాగర్, శాసన సభ్యుడు శ్రీ తేతలి లక్ష్మీనారాయణరెడ్డి, రేడియో ఇంజనీరు శ్రీ హెచ్. జోగారావు, పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు, శ్రీ పి. లక్ష్మీనరసింహం, జిల్లా అగ్నిమాపక దళాధిపతి శ్రీ బి. కె. కె. మూర్తిరావు, తహశీల్దార్ శ్రీ కొవ్వలి సూర్యప్రకాశరావు, శ్రీమతి శేషు శ్రీరంగం, అధికారేతర సభ్యులు శ్రీ కొవ్వూడి లింగరాజు, డాక్టర్ కె. ఎల్. నరసింహారావు, డాక్టర్ దీక్షితులు, శ్రీమతి ఆక్కెపల్లి వివేకానందదేవి, యింకనూ పలువురు వేర్వేరు శాఖల సహోద్యోగులూ యీ సమావేశంలో పాల్గొన్నారు.

పుష్కరసంఘ కార్యదర్శి సబ్ కలెక్టర్ శ్రీ వింజమూరి శ్రీనివాసాచారి యింతవరకు ఈ సంఘము ఎన్నిసార్లు సమావేశమైనదీ, ఏ ఏ యేర్పాట్లు ఎట్లు చేయాలనే నిర్ణయానికి వచ్చినదీ, అందుకు ఆదాయ వ్యయాల అంచనా, ఇప్పటికి వసూలు అయిన మొత్తమూ ఖర్చు అయిన మొత్తమూ, ముందు పరిస్థితీ వివరించారు. (ఈ వివరాలు సంగ్రహంగా 10వ తేదీ పత్రికలో వివరించాము) పుష్కర సంఘానికి ఆర్థిక సహాయం కావాలని చేసిన విజ్ఞప్తులకు తృప్తికరమైన సమాధానం లభించటం లేదన్నారు. పుష్కర శిబిరంలో పాకలు వేయడానికి 40000 వెదురు కాకినాడ జిల్లా అటవీశాఖాధికారి అసలు ఖరీదుకు పేపరుమిల్లు వద్దనుంచి యిప్పించారన్నారు. పుష్కరశిబిరాలలో కుటుంబ నివాసాలకు రోజుకు రు. 1-8-0 అద్దె వసూలు చేయిస్తారని చెప్పారు.

### మంచినీటివసతులు

ఆంధ్రా పేపరుమిల్లులోని యినుక పేసిన వసపోతకుండీలను యిప్పుడూ— యికముందూ కూడా ఉపయోగించాలను కుంటున్నామన్నారు. పేపరుమిల్లులో మంచినీటిజల వున్న బావివద్ద కట్టిన ఎత్తైన నీటి నిర్మాణాన్ని ప్రస్తుతము ఉపయోగించుకొనడానికి ఆ అధికార్లను ఒప్పించామనీ, తద్వారా ఎత్తు ప్రదేశాలకు కొంతవరకూ నీటి సరఫరా చేయగలమన్నారు.

### భోజనవసతులు

పుష్కర శిబిరంవద్ద ఉచిత భోజన సౌకర్యాన్ని పాకల రూపకంగా యివ్వడానికి తగిన యేర్పాట్లు జరుగుతున్నాయనీ, యీ సందర్భంలో చాలమంది ఉదారులు సహాయపడుతున్నారని వివరించారు. రాజమండ్రిలో సాధారణంగా ఉచిత భోజన వసతులిచ్చే ధర్మసత్రాల ధర్మకర్తలతో తాము సంప్రదించామనీ-వారు ఆదనంగా ఆ సత్రాలలో పాకలువేసి, యింకా హెచ్చుమందికి మామూలు కంటె మూడునాలుగురెట్లు హెచ్చు మందికి ఉచితభోజన సౌకర్యాలు యేర్పాటు చేయగలమని వాగ్దానం చేశారని వెల్లడించారు.

### అవసర వైద్యం

పుష్కరం రోజులలో వ్యాధుల చికిత్సకు రెండు మోటారుబస్సూ రెండు ప్రథమచికిత్స మోటార్లూ తరచుగా తిరుగుతూవుండే యేర్పాట్లు చేశామన్నారు.

### వార్తాప్రసారం

పురపాలక తంతిప్రసార కేంద్రానికి ఇప్పుడున్న 20 ప్రసార స్థానాలూ గాక, మరి 12 యేర్పాటు చేయిస్తున్నామనీ, తప్పిపోయినవారి విషయం పోయినవస్తువుల విషయం యితర అవసరవిషయాలూ తద్వారా ప్రసారం చేస్తారనీ చెప్పారు.

### తంతి తపాలా సౌకర్యాలు

అదనపు తంతి తపాలా కార్యాలయాలు యేర్పాటు చేయటమేగాక, టెలిఫోన్ స్థానాలుకూడా యేర్పాటు చేయిస్తున్నామనీ, మామూలు పోస్టు ఆఫీసులు అదనంగా పనిచేసే ఏర్పాటు జరుగుతుందనీ, పెద్ద పోస్టాఫీసు 24 గం॥లూ తెరచి వుంచే సౌకర్యాన్నీ ఆంధ్రదేశంలో ప్రప్రథమంగా సంచార తపాలా ఆఫీసు యేర్పాటు చేయడానికి గాను పోలీసు శాఖ శకటాన్ని ఎరువుగా యివ్వమని కోరామనీ తెల్పారు.

### బాలభటులు

500 మంది భారత బాలభటులు ఈ సందర్భంలో సహాయార్థం వస్తున్నారనీ, జాతీయ విద్యార్థి శిక్షణదళాలు కూడా వస్తున్నవనీ చెప్పారు.

కుష్ఠరోగులూ - ముష్టివాళ్లు యాత్రికులకు అడ్డమువచ్చి బాధించకుండా శ్రీ అలపాటి భాస్కర రామయ్య తోటలో (జైలువద్ద) వారికి ప్రత్యేక యేర్పాట్లు చేశామని చెప్పారు. ఈ యేర్పాట్ల నిర్వహణలో బాధ్యత వహించి పనిచేసేందుకు మొత్తం 14 ఉపసంఘాలు యేర్పరచినట్లు వెల్లడించారు.

కుష్ఠరోగి, ముష్టివాళ్ల బాధ పట్టణంలో చాల బాధకరంగా వున్నదనీ, మామూలుగానే వీధులవెంటనడిచే బాటసార్లకు చికాకుగా వున్నదనీ డాక్టర్ కాశీభట్ల లక్ష్మీనరసింహారావు జిల్లా కలెక్టరుదృష్టికి తీసుకురాగా—కలెక్టర్ "అది ఒక సమస్యే! కాని ముష్టి ఎత్తటం నేరంగా పరిగణించదగిన వృత్తి కాదు! కనుక ఆ వృత్తి మానివేయాలని వారిని వత్తిడిచేయటానికి ఎవరికీ హక్కు లేదు! అయినప్పటికీ తగిన సహాయసౌకర్యాల యేర్పాట్లతో వారిని దూరంగా వుంచటానికి ప్రయత్నిస్తున్నాము" అని సమాధానమిచ్చారు.

### మంచినీరు

శ్రీ లింగరాజు మంచినీటి సరఫరా వసర్లను ఎట్లా అభివృద్ధి చేస్తారో యింకా వివరించవలసినదని కోరారు. అదే తీవ్ర సమస్య అని అత్యంతావశ్యకమనీ శ్రీ లింగరాజు అన్నారు. కలెక్టరు (పురపాలకసంఘ యింజనీరు శ్రీ దాసరి రామారావు నడిగి తెలుసుకొని) ప్రస్తుతం 80 వేల గాలన్‌లవరకే యివ్వగలుగుతూవున్న నీటి సరఫరా నిర్మాణంలో 95 వేల గాలన్‌లవరకూ యిచ్చే అభివృద్ధి జరిగిందనీ, యిదిగాక పట్టణంలోని బావులను బాగుచేయించి నీరు సరఫరా చేస్తారనీ, అవసరానికి సైనిక నీటి నిల్వ టాంకుల తెప్పించటానికికూడా ప్రయత్నిస్తున్నామనీ వివరించారు.

### ఆహారపదార్థాలు-చౌకడిపోలు

ఆహారపదార్థాలచౌకడిపోల ఏర్పాట్ల అవసరంగురించి శ్రీ లింగరాజు చెప్పగా ప్రభుత్వ నిల్వలనుంచి బియ్యం సరఫరాచేసే డిపోల యేర్పాటు చేయనున్నామని కలెక్టరు చెప్పారు.

జిల్లా వైద్యశాఖాధికారి డా॥ కె. చంద్రరావు మాట్లాడుతూ ప్రథమ చికిత్స కేంద్రాలూ, వైద్యసహాయ కేంద్రాలూ, ఆసుపత్రి యేర్పాట్లూ మొత్తం 16 కేంద్రాల యేర్పాటు చేయనున్నామన్నారు. అందుకు సహాయానికి 96 గురు స్వచ్ఛంద సేవకులు కావాలన్నారు. సబుకలెక్టరు శ్రీ శ్రీనివాసాచారి స్వచ్ఛందసేవకుల నిస్తామన్నారు.

ప్రజారోగ్యశాఖ డైరెక్టర్ శ్రీ దిగవల్లి సుబ్బారావు జిల్లా వైద్యశాఖాధిపతికి సెయింటు జాన్ అంబులెన్సు కాకినాడ దళాన్ని యిక్కడ వుంచే యేర్పాటు చేయమనీ, ఆదేశాఖ బందరు దళాన్ని కూడా మరికొన్ని రోజులు వుంచేందుకు గాను కోరవలసినదనీ, డా॥ చెట్టి యీ సందర్భంలో సహకరిస్తామని తమతో చెప్పారనీ తెల్పారు.

శ్రీ నాగేశ్వరరావు వైద్య కళాశాలల (గుంటూరు - విశాఖపట్టణం) విద్యార్థుల సహకారం కోరవలసిందనీ వారు ఉదారంగా స్వంత ఖర్చులపై వచ్చి సహకరిస్తారనీ, వరద రోజులలో అట్లా సహకరించారనీ, జిల్లా వైద్యాధికారికి సలహా యిచ్చారు. (స్వ. వి.)

---

బొంబాయి, ఏప్రిల్ 10: ఏప్రిల్ 6వ తేదీతో అంత్యమైన వారంలో రూ. 68,49,75,000 భారత ప్రభుత్వ బిల్లులు రిజర్వుబ్యాంకో పేరిట అమ్మకమైనవని నేడు ఒక ప్రకటన వెలువడింది.

# శ్రీ బండారనాయకే ప్రమాణ స్వీకారం

## అల్పసంఖ్యాకులకు రక్షణ కల్పిస్తానని వాగ్దానం

కొలంబో, ఏప్రిల్ 12: మహాజన ఏకసత్త పెరమూనా నాయకుడు శ్రీ యస్. డబ్లియు. ఆర్. డి. బండారనాయకే సింహళ ప్రధాన మంత్రిగా ప్రమాణస్వీకారం చేశారు.

సింహళానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తరవాత ప్రధాని పదవి నిర్వహించినవారిలో శ్రీ బండారు నాయకే నాల్గవవారు. ఇంతకుముందు శ్రీయుతులు సర్ డాన్ స్టీఫెన్ సేనానాయకే, వారి కుమారుడు డడ్లీ సేనానాయకే, సర్ జాన్ కొటెలావాలా వరసగా ప్రధానమంత్రులుగా ఉన్నారు.

శ్రీ బండారునాయకే నూతనమంత్రివర్గం యీ సాయంకాలం 4 గంటలకు క్వీన్సు హౌస్ భవనంలో ప్రమాణస్వీకారం చేశారు. గవర్నర్ జనరల్ సర్ ఆలివర్ గుణతిలకే వీరిచేత ప్రమాణస్వీకారం చేయించారు. కొత్త ప్రధాని, పదవీ స్వీకారానికి గవర్నర్ జనరల్ భవనానికి పోయేటప్పుడు దారిలో, పురుషులు, స్త్రీలు వీరిని ఉత్సాహంతో అభినందించారు.

శ్రీ బండారునాయకే యీ క్రింది 12 మందిని మంత్రివర్గ సభ్యులుగా నియమించారు. శ్రీయుతులు డబ్లియు దహనాయకే (విద్య), సి. పి. డి. సిల్వా, (భూములు, భూముల అభివృద్ధి), యస్. డబ్లియు. హెచ్. డి. సిల్వా (పరిశ్రమలు), స్టాన్లీ డిజాయ్సా (ఆర్థిక రంగం), ఫిలిప్ గుణవర్ధనే (వ్యవసాయము, ఆహారము), టి. బి. ఇలంగరత్నే (కార్మిక, గృహ, సాంఘిక శాఖలు); ఏ. పి. జయసూర్య (దేశీయాంగ విధానం), జయవీర కురుప్పు (స్వపరిపాలన, సాంస్కృతిక విషయాలు), సి. వి. యస్. మారిక్కార్ (తపాలా, సమాచార శాఖలు), యమ్. సేనానాయకే (రహదారులు, నిర్మాణాలు), శ్రీమతి విమలా విజేవర్ధనే (ఆరోగ్యం), శ్రీ సి. హెచ్. డబ్లియు. డి. సిల్వా వాణిజ్య వ్యాపార మంత్రిగా వ్యవహరిస్తారు.

ప్రధానమంత్రి దేశ రక్షణ, విదేశాంగ వ్యవహారాలు చూస్తారు.

వీరిలో 10 మంది మంత్రులు మహాజన ఏకసత్త పెరమూనా టిక్కెట్టుమీద ఎన్నికల్లో నెగ్గారు. శ్రీ ఏ. పి. జయసూర్య సెనెటు సభ్యుడు, పెరమూనా కార్యదర్శిగా పని చేస్తున్నారు. శ్రీ యస్. డబ్లియు. హెచ్. డి. సిల్వా పెరమూనా సభ్యుడుగా ఉన్నారు. త్వరలో వీరిని సెనేటుకు నియమిస్తారు.

ఈ మంత్రి వర్గంలో శ్రీ యుతులు ఫిలిప్ గుణవర్ధనే, పి. హెచ్. డబ్లియు. డి. సిల్వా విప్లవ లంక సమ సమాజపార్టీ (రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ) లోనూ శ్రీ డబ్లియు. దహనాయకే, సింహళ భాషా పెరమూనాలోనూ సభ్యులు. మిగిలినవారు శ్రీ లంక స్వతంత్ర పక్ష (శ్రీలంకపార్టీ) సభ్యులు.

### ప్రథమ మహిళా మంత్రి

సింహళ మంత్రివర్గంలో యిప్పటి వరకు నియమితులైనవారిలో శ్రీమతి విమలా విజేవర్ధనే మొదటి స్త్రీ సభ్యురాలు.

ఈ ఎన్నికల్లో స్వతంత్ర సభ్యుడుగా పోటీచేసి రెండుస్థానాలు గెల్చుకొన్న శ్రీ ఆర్. జి. సేనానాయక త్వరలో మంత్రివర్గంలో చేరతారని అనుకుంటున్నారు.

తన ప్రత్యర్థులతోసహా జాతిమత వివక్షత లేకుండా అల్పసంఖ్యాక వర్గాల వారందరికీ, న్యాయం జరిగేటట్లు చూస్తానని శ్రీ బండారు నాయకే వాగ్దానం చేశారు.

తాను తన సహచరులూ తనపైవున్న గురుతర బాధ్యతను నిర్వర్తించటానికి అనువుగా ప్రభుత్వ కార్యకలాపాల్లో ప్రవేశిస్తున్నామని ప్రధానమంత్రి తెలియజేశారు.

శ్రీ నెహ్రూకూ తనకూ మధ్యవున్న పరస్పర స్నేహ గౌరవాలదృష్ట్యా సింహళ భారతీయ సమస్యకు ఒక అంగీకార యోగ్యమైన పరిష్కారం కనపడగలదని ఆశిస్తున్నానన్నారు. శ్రీ బండారు నాయకే.

### అధికారభాష

సింహళభాషను అధికార భాషగానూ రాష్ట్రభాషగానూ చేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

# 1966 నాటికి కోటిన్నర టన్నులకు పైగా ఉక్కు ఉత్పత్తి

## కొత్త ఫ్యాక్టరీల్లో 75 లక్షల టన్నులు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 12: ఇంకొక పది సంవత్సరాలలో- అంటే తృతీయ పంచవర్ష ప్రణాళిక చివరకు- దేశంలో ఉక్కు ఉత్పత్తి దాదాపు 150 లక్షల టన్నులు మొదలు 180 లక్షల టన్నులవరకూ ఉండేట్లు చేయాలని ప్రభుత్వం ఉద్దేశిస్తున్నదని ఇనుము-ఉక్కు-శాఖమంత్రి శ్రీ టి. టి. కృష్ణమాచారి నేడు లోక్‌సభలో వెల్లడించారు.

ఇందుకోసం తగిన పథకం వేసి దానిని అమలుజరిపేందుకు ప్లానింగ్ కమిషన్‌తో ఈ విషయం తాను సంప్రదించ దలచినట్లు ఆయన వెల్లడించారు. కొత్తగా నిర్మిస్తున్న రూర్కెలా, భిలాయి, దుర్గాపూర్ ఫ్యాక్టరీలు మూడింటిలోనూ కలిపి 75 లక్షల టన్నుల ఉక్కును ఉత్పత్తి చేయగలవని ఆయన తెలియజేశారు. ఈ మూడు ఫ్యాక్టరీలూ ఇంచుమించు ఒకే సమయానికి పని ప్రారంభించ గలవని ఆయన అన్నారు.

ఉక్కు పరిశ్రమకు సంబంధించిన వ్యవహారాలన్నిటికీ స్థూలంగానూ, బ్రిటిష్ సహాయంతో దుర్గాపూర్‌లో ఏర్పడే ఫ్యాక్టరీకి ప్రత్యేకంగానూ ఇంటర్నేషనల్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ అనే బ్రిటిష్ సంస్థను సలహాదారుగా ఏడాదికి ఆరులక్షల రూపాయల జీతం మీద భారత ప్రభుత్వం నియమించిందని ఆయన తెలియజేశారు. ఈ సంస్థ చాలా అమూల్యమయిన సలహాలిచ్చిందనీ, దీనివల్ల ప్రభుత్వానికి చాలా డబ్బు ఆదా అయిందనీ ఆయన తెలియజేశారు.

ఫ్యాక్టరీలకు కావలసిన యంత్రాలను కొనటంలో ఒక పద్ధతి నిర్ణయమయిందని శ్రీ కృష్ణమాచారి వెల్లడించారు. టెండర్లు కోరటంకన్నా, ప్రసిద్ధ సంస్థలతో బేరమాడటమే మేలుగా కనిపించిందని ఆయన వివరించారు.

లోక్‌సభ నేడు ఇనుము ఉక్కుశాఖ పద్దులమీద (43 కోట్ల 88 లక్షలు) చర్చ ప్రారంభించింది. చర్చలో శ్రీ అశోక్ మెహతా మాట్లాడుతూ ఉక్కు ఫాక్టరీల ఉత్పత్తి శక్తిని గురించి తడవకొక విధంగా చెప్పటం జరుగుతున్నదనీ, ఇది అవగాహన లేకపోవటంవల్లనేననీ విమర్శించారు. శ్రీ బన్సాల్ మాట్లాడుతూ యంత్రాల కొనుగోలు ఒప్పందాలు వ్యాపార ఒప్పందాలుకాకుండా ఇంచుమించు దానస్వీకారం అయినట్లుగా ప్రభుత్వవర్గాలు భావించటం ఉచితం కాదన్నారు. సిబ్బందిలో స్థానికులకు తగినస్థానం ఇవ్వాలన్నారు.

### బొగ్గు సప్లయికి జాగ్రత్త

దేశంలో ఉక్కు పరిశ్రమ ఏడాదికి కోటిటన్నుల బొగ్గు వాడుతున్నదనీ, బొగ్గు పరిశ్రమ విషయమై అంచనాల సంఘం సిఫార్సులను అమలు జరపకపోతే, ఉక్కు పరిశ్రమ బొగ్గుకొరతవల్ల దెబ్బతినవచ్చుననీ శ్రీ అశోక మెహతా హెచ్చరించారు. ఉక్కు పరిశ్రమను దేశంలో నలుప్రాంతాల్లోనూ విస్తరించి ఆపరిశ్రమలో ఏప్రాంతంలోనూ కేంద్రీకరణ జరక్కుండా చూడాలనీ, దానివల్ల దేశమంతటిలోనూ ఒకేధరలు ఉండ వీలవుతుందనీ ఆయన హెచ్చరించారు.

శ్రీ బి. దాస్ బ్రిటిష్ ఇంజనీర్లను సలహాదార్లుగా నియమించటాన్ని విమర్శించారు.

శ్రీ ఆర్. జంగ్డే (మధ్యప్రదేశ్) మాట్లాడుతూ భిలాయ్ ఫ్యాక్టరీకోసం స్థలాలను తీసుకునేటప్పుడు సొంతదార్లకు పరిహారం ఇచ్చేపద్ధతి సరిగా లేదన్నారు. కార్మికులను కాంట్రాక్టర్ల ద్వారా నియమించేపద్ధతి పోవాలని ఉద్ఘాటించారు. శ్రీ సారంగధరదాస్ రూర్కెలాదగ్గర భూముల పరిహారం కూడా సరిగా లేదన్నారు.

### బ్రిటిష్ అప్పు: వడ్డీ

శ్రీ బి. పి. జంఝున్‌వాలా మాట్లాడుతూ, అన్ని ఫ్యాక్టరీలూ మొదట అనుకున్న ప్రకారం 1959 నాటికి పని ప్రారంభించేట్లు చూడాలన్నారు. బ్రిటన్ ఇచ్చే అప్పుమీద వడ్డీ నిర్ణయించక పోవటం ఉచితంగా లేదన్నారు. భారతదేశపు స్టర్లింగ్ నిలవలలో అప్పును సరిపెట్టాలని అన్నారు.

ద్వితీయ ప్రణాళిక చివరకు అరవై లక్షల టన్నుల్ని ఉత్పత్తి చేసినా భారతదేశంలో మెక్సికో, ఈజిప్టు, అర్జెంటీనా వంటి వెనకబడిన దేశాల్లో కన్నా సగటున వ్యక్తివాడే ఉక్కు చాలా తక్కువని శ్రీ వి. పి. నాయర్ విమర్శించారు.

మంత్రిగారు జవాబిస్తూ, 60 లక్షల టన్నుల లక్ష్యం తనకే తృప్తికరంగా లేదనీ, మూడో ప్రణాళిక నాటికి 180 లక్షల టన్నులవరకూ పెంచాలని తన లక్ష్యమనీ తెలియజేశారు. అంత ఉత్పత్తి పెంచటమేకాక, దానిని ఉపయోగించేందుకు ఇతరత్రా పరిశ్రమలను పెంపొందించవలసి వున్నదని కూడా అన్నారు.

స్టర్లింగ్ నిలవలను అప్పుకి సరిపెట్టే విషయమై ఆయన ప్రస్తావిస్తూ, వాటిమీద దాదాపు 3½% నుంచి 4% వరకూ వడ్డీ వస్తున్నదనీ, మనం తీసుకునే అప్పుమీద వడ్డీ రేటు కన్నా తక్కువేనన్నమాట నిజమేనని అన్నారు. అయితే మనకు అప్పు 1958 నాటికి కావలసి వుంటుందనీ, అప్పటికి మన స్టర్లింగ్ నిలవలు తరిగిపోగలవని అన్నారు. ద్వితీయ పథకానికి ఐయ్యి కోట్ల రూపాయల విదేశీ ద్రవ్యం కావలసి వున్నదనీ, స్టర్లింగ్ నిలవలను దీనికికూడా వినియోగించవలసి వున్నదనీ ఆయన సూచించారు.

యంత్రాల కొనుగోలుకు సంప్రదింపులే మేలని వాదిస్తూ, రూర్కెలా ఫ్యాక్టరీకి ఒకే ఒక టెండరు వచ్చిన సంగతిని ఉదహరించారు. అన్ని దేశాలకూ చేతినిండా పని వున్నదనీ, బ్రిటన్‌లో ఈ కాంట్రాక్టు ప్రాసుకోకపోతే, వాళ్లుకూడా ఇతర పనులు మొదలుపెట్టటం, మనకు ఏ సరుకూ దొరక్కపోవటం జరుగుతుందన్నారు.

అనంతరం లోక్‌సభ ఇనుము-ఉక్కు-శాఖపద్దుల్ని ఆమోదించింది.

అనంతరం సభ వాణిజ్య, పరిశ్రమల శాఖ పద్దులపై చర్చ ప్రారంభించింది. డా॥ ఎ. ఎం. థామస్ మాట్లాడుతూ సిమెంటు బ్లాకు మార్కెట్టులోకి పోతున్నదనీ, దీనిని అరికట్టేందుకు ప్రభుత్వం విదేశాలనుంచి సిమెంటును దిగుమతి చేయాలనీ అన్నారు.

### విదేశీ పరిశ్రమలు

డా॥ సి. హెచ్. వి. రామారావు గారు మాట్లాడుతూ దేశంలో విదేశీ పెట్టుబడుల పెరుగుదలను ప్రభుత్వం గట్టిగా ప్రతిఘటించాలన్నారు. కనీసం సబ్బులు మొదలైన నిత్యావసర వస్తువులనయినా ఈ దేశంలో విదేశీయ సంస్థలు ఉత్పత్తి చేయటంమీద నిర్బంధాలు విధించాలని హెచ్చరించారు.

### ఆంధ్రలో సిగరెట్ ఫ్యాక్టరీ

మందుల పరిశ్రమను, బొగ్గుపరిశ్రమను జాతీయం చేయాలనీ, సిమెంటు బ్లాకు మార్కెటింగును అరికట్టేందుకు ప్రభుత్వమే సొంత ఫ్యాక్టరీలను నెలకొల్పాలనీ శ్రీ రామారావుగారు సూచించారు. ఆంధ్రరాష్ట్రంలో సిగరెట్ల ఫ్యాక్టరీ స్థాపించాలనీ, ప్రభుత్వం వ్యాపార నిర్వహణకు ఉపక్రమించాలనీ, ఆయన సూచించారు.

సమావేశం ఎల్లుండికి వాయిదా పడినది.

## చిన్న పరిశ్రమలకు ప్రభుత్వ సహాయం

### ఉపమంత్రి వివరణ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 11: ద్వితీయ పంచవర్ష ప్రణాళికకాలంలో చిన్న పరిశ్రమలకు ఆర్థిక సహాయం చేసేందుకుగాను 20 కోట్ల రూపాయలను ప్రత్యేకించేందుకు భారతప్రభుత్వం ఆలోచిస్తున్నది. ఈ సహాయకార్యక్రమంవల్ల రాష్ట్ర సహకారబ్యాంకులకూ, ప్రభుత్వ సహాయం లభించే చిన్న పరిశ్రమలన్నింటికీ డబ్బు లభిస్తుంది. కేంద్ర ప్రభుత్వంలో పరిశ్రమలశాఖ ఉపమంత్రి శ్రీ నిత్యానందకనుంగో నేటి రాత్రి ఢిల్లీ రేడియోలో 'ద్వితీయ ప్రణాళికలో చిన్నపరిశ్రమలు' అనే అంశంమీద మాట్లాడుతూ ఈ విషయాలను వెల్లడించారు.

"చిన్న పరిశ్రమల అభివృద్ధికి ప్రభుత్వం తీసుకున్న చర్యల్లో ముఖ్యమయినది సులభషరతులమీద అప్పులివ్వటమే. రాష్ట్రప్రభుత్వాలకు దీనికి కావలసిన ధనాన్ని కేంద్రం ఇస్తున్నది. చిన్న పరిశ్రమలను నెలకొల్పే పారిశ్రామికులకు 3% వడ్డీకి, వాటిని నెలకొల్పే సహకారసంఘాలకు 2½% వడ్డీకి అప్పులివ్వటమన్నది ప్రభుత్వ విధానం.

### సాంకేతిక సహాయం

దీనితోపాటుగా, చిన్నపరిశ్రమలకు సాంకేతిక సహాయం చేయటానికి కూడా ప్రభుత్వం ప్రత్యేకస్థానం ఇచ్చింది. బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసుల్లో ప్రాంతీయ సాంకేతిక సహాయసంస్థలు నెలకొల్పబడినవి. ప్రతి రాష్ట్రంలోనూ ఒక్కొక్క సంస్థనూ, వాటికిశాఖలనూ నెలకొల్పాలనిసంకల్పం.

ఈ సహాయాల చిన్నపరిశ్రమలూ ఆర్థికంగా నిలబడకలుగుతవి. దానివల్ల నిత్యావసరవస్తువులఉత్పత్తి పెరగటమేకాక, చాలామందికి పని దొరుకుతుంది" అని శ్రీ కనుంగో వివరించారు.

## పాక్ హైకమీషనరు: మళ్లీ ఢిల్లీకిరాడు

కరాచీ, ఏప్రిల్ 11: భారత దేశంలో పాకిస్థాన్ హైకమీషనరుగా ఉంటున్న రాజా గజనఫర్ అలీ ఖాన్, కరాచీ వచ్చారు. బహుశా అయన ఇక తిరిగి భారత దేశానికి తిరిగి వెళ్లరు.

రాయబారుల హైకమీషనర్ల మార్పులో గజనఫరాలీనికూడా ప్రభుత్వం మార్చుతుందా, అని పత్రికా విలేఖరులలో ఒకరు, ప్రభుత్వ ప్రతినిధిని అడగగా, అది సంభవం కావచ్చునని ఆయన చెప్పారు.

గజనఫరాలీని, భారతదేశం నుంచి పిలవనంపాలని, పాకిస్థాన్‌లో కొన్ని పత్రికలు గోల చేస్తున్నవి. వీటి విషయంలో ఏమైనా చెబుతారా అని ప్రశ్నించగా ఆయన నిరాకరించారు.

## సంపాదకునకు లేఖలు

### మునిసిపల్ కంట్రాక్టర్లు పన్నులు

అర్యా, విజయవాడలో మునిసిపల్ కంట్రాక్టరు గుమాస్తాలు రోడ్డుమీదుగా వచ్చే పోయే బండ్లనుండి చట్ట విరుద్ధముగా ఫీజులు వసూలుచేస్తూ ఉన్నారు. 'బండ్లదొడ్లో' ఆపిన బండ్ల నుండి పన్ను వసూలు చేయవలెనని మునిసిపల్ రోడ్లమీద బోర్డులు కూడా వేయబడి యున్నవి. అయినప్పటికీ కంట్రాక్టరు గుమాస్తాలు రోడ్లమీద పోయేబండ్లనుండి వచ్చేపోయే బండ్లనుండి బలాత్కారముగా పన్నులు వసూలుచేస్తున్నారు. ఈ విషయమయి నేను మునిసిపలు అధికారులకు అర్జీలు యిచ్చియున్నాను. కాని వారు ఏ విధమైన చర్య తీసుకొని యుండలేదు. ఇది చాలా అన్యాయమని భావించుచున్నాను. కొబట్టి ఇప్పటికైనా మునిసిపలు అధికారులు యీ విషయమయి దర్యాప్తు చేయించి, ఈ అన్యాయమును తొలగింప గలందులకు వారిని వేడుచున్నాను.

విజయవాడ, దశిక సూర్యప్రకాశరావు.

* * *

### బస్సుప్రయాణాలలో జరుగుతున్నది

అర్యా, బస్సుప్రయాణికుల పరిస్థితినిగురించి 8వ తేదీ ఆదివారం పత్రికలో శేకపల్లి సత్యనారాయణమూర్తి గారు వ్రాశారు. బస్సువాళ్లకి 'ఓవర్ లోడ్' చెయ్యడం నిత్య కృత్యమై పోయిందనీ, హెచ్చుటికెట్లు వసూలు చేస్తూ సమయానుకూలంగా పెంచుతున్నారనీ, అడిగితే మా బస్సులో ఖాళీలేదు పొమ్మంటున్నారనీ వ్రాశారు. జరిగిన - జరుగుచున్న విషయాన్ని వాస్తవికంగా, నిష్పక్షపాత బుద్ధితో వెల్లడించిన ఆయన వ్యాసంలో, ప్రయాణీకులనిత్యమూ అనుభవించే కష్టనిష్ఠూరాలు చక్కగా చిత్రింపబడ్డాయి.

మా 'కోనసీమ'లో రైలు సౌకర్యం లేనందువల్ల దూరప్రయాణాలకి బస్సులే ముఖ్యాధారం. బస్సుల్లో ప్రయాణించేవారి సంఖ్య అధికం కావడం వల్లనూ, తగినన్ని బస్సులు లేనందువల్లనూ, మా ప్రాంతంలో స్వార్థమూ, స్వప్రయోజనమూ బలీయంగా మరో పేరుతో దుక్కున్నా యిప్రజలకీ, ప్రభుత్వానికి నమ్మిన బంటులైన పోలీసులు యీ విషయంలో యేమీ శ్రద్ధవహించడంలేదు. పైపెచ్చు తమ "హోదా"లకి అనుగుణంగా ముందు వెనుక సీటుల్లో ఉచితంగా ప్రయాణాలు సాగిస్తున్నారు. శాంతి భద్రత - ఇవేతమ లక్ష్యంగా పెట్టుకున్న పోలీసులూ, ప్రజోపయోగ మేతమవిధ్యుక్తధర్మంగా కలిగిన బస్సువాళ్లూ ఒకరి 'కష్టాల్ని' మరొకళ్లు ఆదుకుంటూ వాస్తవమూ, నిత్యమూ అయిన ధర్మాన్ని పాటించడానికి వెనుకాడటం లేదు. నిత్యమూ సాగే యీ అసౌకర్యానికి కారణం 'రీజనల్ ట్రాన్స్‌పోర్టు' ఆఫీసు యేమీ శ్రద్ధవహించి పని చేయక పోవడంవల్లనే కావచ్చును.

ఉదాహరణకి నేను ఈ మధ్యనే స్వయంగా చూచి — అనుభవించిన విషయాన్ని వ్రాస్తాను.

గతనెల 17-వ తేదీన అమలాపురం విడదాముని బయలుదేరి బొబ్బర్లంకలో నేను బస్సు ఎక్కాను. బస్సులో దరిదాపు 70 లేక 80 మందిని ఎక్కించడంవల్ల నుంచోడానికికూడా చోటు దొరకలేదు. కొందరివద్ద టిక్కెట్టు యివ్వకుండా రెండింతలు ఖరీదు వసూలుచేశారు. కండక్టర్ని సీటు చూపమని అడగ్గా నిర్లక్ష్యంతో సమాధానమివ్వలేదు. నేను కారు మొదట్లో హారన్‌వద్ద నిల్చుండగా బలవంతంగా క్రిందికిలాగి అవమానించి వెనుకవైపున ఎక్కడ చోటువుంటే అక్కడ నిలబడమని కండక్టర్ చెప్పినాడు. విధిలేక ఒకకాలు మాత్రమే అని నిల్చుండి ఊబలంక వరకూ ప్రయాణం చేశాను. అక్కడ కొందరు కాఫీలకు దిగగా ఒక సీటులో కూర్చున్నాను. అంతకు ముందు ఆ సీటులో కూర్చున్న వ్యక్తి నన్ను బలవంతంగా చెయ్యిపట్టి క్రిందికి లాగివేయడానికి ప్రయత్నించినాడు. ఏమిచేసినా నేను దిగక పోయేసరికి కొంతసేపటికి వాళ్లకి మాట్లాడక పూరుకోకుండా తిప్పినదికాదు. చిత్రం ఏమిటంటే యిదంతా ముందుసీటులో ఒక కానిస్టేబుల్ కూర్చునివుండగానే జరిగినది. కారులో సీటు చూపమని అడిగితే చివరకు నాకు జరిగిన 'సన్మానం' అది.

ఆ వ్యాసకర్త తెలిపినట్లు ఎన్నటికయినా ఈ వికృత చర్యలకి విముక్తి ఉన్నదా? ప్రజాప్రభుత్వంలో ప్రజల 'హక్కు'లు' పరిరక్షించబడే శుభదినం త్వరలో రాగలదా?

పెండ్యాల సత్యనారాయణమూర్తి,
మానేపల్లి.

## రూపాయల నోట్లు స్వాధీనం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 12: మద్రాసు, ఆంధ్ర రాష్ట్రాల్లో 4 లక్షల రూపాయల పై చిలుకు విలువగల దొంగ వంద రూపాయల నోట్లు బయట పడ్డాయని లోక్ సభలో, ఆదాయం, రక్షణ ఖర్చుల మంత్రి శ్రీ ఏ. సి. గుహ తెలియజేశారు.

ఇలాంటి దొంగ నోట్లను ఆంధ్రలో 689 మద్రాసు నగరంలో 2583 ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నది.

# హర్షాపురంలో సిమెంటు కొరత

## దొంగచాటుగా బస్తా రూ 9 కి అమ్మకం

హర్షాపురం, ఏప్రిల్ 10: అయిదు నెలల నుంచీ ఈ పట్టణంలో సిమెంటు మచ్చుకైనా ప్రజలకు సులభంగా దొరకటం లేదు. సిమెంటు పొందడానికి విశ్వప్రయత్నం చేయవలసి వస్తున్నది. సిమెంటులో కట్టవలసిన కట్టడాలు నిలచి పోతున్నాయి. బస్తా రు 6 అమ్మవలసిన సిమెంటు రు 9 బహు కష్టం మీద దొంగచాటుగా దొరుకుతోంది.

గ్రామంలో శ్రీశైలం రోడ్డు నిర్మాణం కోసం పి. డబ్ల్యు. డి. పనులకోసం సిమెంటు వేలాది బస్తాల నిలవ ఉన్నది. శ్రీ లక్ష్మీ చెన్న కేశవస్వామి వారి తిరునాళ్లు వచ్చే మాసంలో రానున్నవి. ఈ తిరునాళ్ళకు రొటువంటి పేద గృహస్తుకూడా తన గృహాన్ని మరామతు చేయించు కుంటాడు. అది ఆచారం. సిమెంటు వర్తకులకు సరుకు వస్తానే ఉన్నది. కానీ ఎప్పుడు అడిగినా సరుకు లేదంటారు. (స్వ. వి.)

## 'ఆంధ్రప్రదేశ్'

1 వ పేజీ 3 వ కాలం తరువాయి

కృష్ణరావు ఇట్లా సమాధాన మిచ్చారు: "అది ఆంధ్ర-తెలంగాణా, మహారాష్ట్రం తదితర రాష్ట్ర శాసనసభలకు సంబంధించిన వ్యవహారం. ఈ సభకు సంబంధమేమీ లేదు. ఈ సభ తన అభిప్రాయాన్ని మాత్రమే ప్రకటించుకున్నది. తుది నిర్ణయాలు చేసే అధికారం పార్లమెంటుదే.

తిమపార్టీ ఆక్షేపణను సవరించుకోవాలని శ్రీ దేశపాండే కోరారు.

అటు తరువాత ఆయా క్లాజులపై వోటింగు జరిగింది. అనుకూలంగా 93, వ్యతిరేకంగా 56 ఓట్లు వచ్చినవి. అతిర్వాత ప్రధాన తీర్మానాన్ని సభ ఆమోదించింది.

## పేరుకు సభ్యులు సుముఖం

(ఆంధ్రపత్రిక ప్రతినిధి)

సికిందరాబాద్, ఏప్రిల్ 10: రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లుపై క్లాజువారీ చర్చ నిన్న ప్రారంభమైనప్పుడు, ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలను కలిపి ఏర్పాటు చేసే విస్తృత రాష్ట్రానికి 'ఆంధ్ర ప్రదేశ్' అనే పేరు పెట్టాలనే చర్చలో పాల్గొన్న సభ్యులు శాసనసభలో ఏకగ్రీవాభిప్రాయం వెలిబుచ్చారని చెప్పవచ్చు.

బిల్లుకు కొన్ని మార్పులను సూచించుతూ శ్రీబూర్గులరామకృష్ణరావుతీర్మానం ప్రతిపాదించిన తరువాత బిల్లు వివరాల పరిశీలన ప్రారంభమైంది. జిల్లాల ఏర్పాట్లు, ఎన్నికలలో పోటీచేసే అభ్యర్థుల నివాసయోగ్యతలు, హైదరాబాద్ హైకోర్టులో ప్రస్తుతం వృత్తి చేస్తున్న న్యాయవాదులను మైసూరు, మహారాష్ట్ర హైకోర్టులకు మార్చడం, కొత్త న్యాయవాదులను చేర్చుకోవడం, విభజన తరువాత మిగిలిపోయే హైదరాబాద్ హైకోర్టు అధికారాలను ఆంధ్ర హైకోర్టుకు సంక్రమింప చేయడం, కరాచీ, బొంబాయి, ఢిల్లీ, లండన్ నగరాలలో రాష్ట్రప్రభుత్వానికి ఉన్న ఆస్తులను పంపిణీ చేయడం, కొత్తగా ఏర్పడే ఆంధ్ర, మహారాష్ట్రలకు ఎగువసభలను ఏర్పాటు చేయడం, తెలంగాణా, కర్ణాటక, మరాట్వాడా ప్రాంతాలకు ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆధ్వర్యాన ఇప్పుడున్న విద్యాసౌకర్యాల క్షేమానికి భంగం రాకుండా ఇకముందు కూడా ఉంచడం మొదలైన అంశాలకు సంబంధించిన సవరణలను ముఖ్యమంత్రి తమ తీర్మానంలో ప్రస్తావించారు.

వివరాల చర్చ మూడు రోజులు జరుగుతుంది.

రాష్ట్రప్రభుత్వం నియమించిన నిపుణుల సంఘం సూచించిన మార్పులను వివరించుతూ ముఖ్యమంత్రి రెండు గంటలసేపు ప్రసంగించారు.

రాష్ట్రం పేరును 'ఆంధ్రప్రదేశ్' అని మార్చమని కోరుతూ, సరిహద్దుల నిర్ణయానికి "రెవిన్యూమండలాన్ని" ప్రాతిపదికగా తీసుకోవాలని సూచించుతూ ప్రతిపక్ష నాయకుడు శ్రీ వి. డి. దేశపాండే బిల్లులోని 2 వ క్లాజుకు సవరణ ప్రతిపాదించారు. ఒక ప్రాంతంలోని జనాభాలో నూటికి 50 మందికంటే ఎక్కువమంది ఒకేఒక భాష మాట్లాడేవారుంటే ఉభయపక్షాల ఆమోదంతో సరిహద్దులను నిర్ణయించాలి. నూటికి 50 మందికంటే తక్కువమంది ఒకేభాషమాట్లాడేవారున్న ప్రాంతాలను సరిహద్దు నిర్ణాయక సంఘం పరిశీలనకు పంపించాలి. జనవాక్యసంద్వారా కొంకిణా తుల ప్రాంతాల భవితవ్యాన్ని నిర్ణయించాలని శ్రీ దేశపాండే అన్నారు. ఇంకా ఇట్లా చెప్పారు: "ఆంధ్రప్రాంతంలో ఉన్నా, తెలంగాణాలో ఉన్నప్పటికీ చారిత్రికంగా తెలుగువారందరు ఆంధ్రులే. అందువల్ల కొత్తరాష్ట్రానికి 'ఆంధ్ర ప్రదేశ్' అని పేరుపెట్టడమే సమంజసం."

విస్తృత ఆంధ్రరాష్ట్రానికి 'ఆంధ్రప్రదేశ్' అని పేరుపెట్టమని కోరుతూ అంతకుముందు ఇటువంటి సవరణను శ్రీ పాగా పుల్లారెడ్డి సూచించారు. శ్రీయుతులు కె. వెంకటరమణారావు (పి. డి. ఎఫ్.), వి.డి. పాండే గారలు ఆ సవరణను గట్టిగా బలపరిచారు.

బిల్లులోని 2-వ క్లాజుకు మొత్తం 16 సవరణలు ప్రతిపాదించారు.

నాందేడ్, మరాట్వాడా, మైసూరులలోని తెలుగు ప్రాంతాలను 'ఆంధ్ర ప్రదేశ్'లో కలిపివేయాలని శ్రీయుతులు అరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి కె. వెంకటరామారావు, కె. ఎల్. నరసింహారావు గారల సవరణలు కోరుతున్నవి.

'ఆంధ్ర ప్రదేశ్' అనేపేరు చాలా బాగున్నదని పి. డి. ఎఫ్. సభ్యుడు [illegible] ప్రత్యేకంగా [illegible]

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సంఘం సిఫార్సు చేసినట్లు ప్రత్యేక తెలంగాణా రాష్ట్రాన్ని ఏర్పాటు చెయ్య

## హిరాకుడ్ ప్రాజెక్టు

సంబల్‌పూర్, ఏప్రిల్ 12: హీరాకుడ్ ప్రాజెక్టు నిర్మాణంలో మొదటి దశ యీ సంవత్సరం ఆగస్టునాటికి చాలాభాగం పూర్తి అవుతుంది. సాగుకు నీరు, పరిశ్రమలకు విద్యుచ్ఛక్తి అప్పటి నుంచి సరఫరా అవడం ప్రారంభమవుతుంది.

జవంబరులో ప్రాజెక్టుకు లాంఛనప్రాయంగా ప్రారంభోత్సవం చేస్తారు.

వచ్చే ఋతువులో లక్ష ఎకరాలకు నీరు అందిస్తారు. పరిశ్రమలకు 24 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేస్తారు.

## తమ్మిలేరు ప్రాజెక్టు

1వ పేజీ 8వ కాలం తరువాయి

పునర్విచారణ చేయవలసినదని కోరారు. పరీక్షా ఫలితాల విషయంలో ఈ కళాశాల జనికి తీసిపోదని తెలియచేశారు.

ముఖ్యమంత్రి "పశ్చిమ గోదావరి జిల్లా స్కూళ్లు ఫైనలు పరీక్షా ఫలితాలలో ఆంధ్ర రాష్ట్రంలో అన్ని జిల్లాలకూ అగ్రస్థానం వచ్చింది. ఆ ఫలితం కళాశాల విద్యార్థుల స్థాయిలో ప్రతిఫలిస్తోందా" అని అడిగారు.

తరువాత ముఖ్యమంత్రి సెంట్ థెరిసాస్ హైస్కూలు, చింతలపాటి సత్యవతీదేవి సెంటు థెరిసా బాలికల కళాశాలను సందర్శించారు. ప్రధానోపాధ్యాయిని కుమారి జె. లలిత, పాలకవర్గం స్వాగతమిచ్చారు.

ముఖ్యమంత్రి ఈ కళాశాల స్థాపనకు అభివృద్ధికీ కారకులైన చింతలపాటి మూర్తిరాజు గారికి తమ కృతజ్ఞత తెలుపుతున్నామన్నారు.

తరువాత మంత్రి దుగ్గిరాలగ్రామం వెళ్ళారు. దుగ్గిరాలవద్దరా గ్రామ రైతుల తరఫున శ్రీ వడ్లపట్ల బసవయ్య ఒక స్వాగతపత్రాన్ని యిచ్చారు. తమ్మిలేటివలన భాగయ్య గ్రామాల రైతుల తరఫున శ్రీ మాగం వెంకటరామయ్య ఒక విజ్ఞప్తిని సమర్పిస్తూ, తమ్మిలేటి నీటిపారుదల విషయంలో వివిధ గ్రామాల మధ్య అనేక కోర్టు వ్యవహారాలు జరుగుతున్నాయనీ, తమ్మిలేరు ప్రాజెక్టు వెంటనే నిర్మించవలెననీ కోరారు.

ముఖ్యమంత్రి జవాబిస్తూ, సంవత్సరాంతమైన ఈ రోజున ఈ సమావేశం జరుగుతోందనీ, దుర్ముఖి నామసంవత్సరపు పేరు చాలా భయంకరంగా ఉన్నప్పటికీ, మనం చిరకాలం నుంచీ కోరుతున్న కోరికలు నెరవేరి శుభప్రదం కాగలదని ఆశిస్తున్నామనీ అన్నారు. శ్రీ నెహ్రూ చెప్పినట్లు 37 కోట్ల జనాభా గల ఈ దేశంలో 37 కోట్ల సమస్యలున్నాయనీ, వాటిని పరిష్కరించేందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయని, ఈ ఒక్క జిల్లాలోనే గత 8 సంవత్సరాలలో, స్థానికఅభివృద్ధి ప్రణాళిక క్రింద 18 లక్షలు ఖర్చు అయిందనీ ఈ విధంగా రెండు మూడు ప్రణాళికలు పూర్తిఅయితేనేగానీ దేశంలోని సమస్యలు పరిష్కారం కావనీ అన్నారు.

# వరంగల్లులో ఉద్యానవనాలు ఎక్కడ వేయాలి?

## స్థలం నిర్ణయంకాక జాప్యం

వరంగల్లు, ఏప్రిల్ 9: వరంగల్లులో పురపాలక సంఘం నిర్మాణం చేయవలసియున్న పార్కు లేదా పురోద్యానవనానికి కావలసిన స్థలాన్ని ఎంపిక చేయడం విషయంలో జరుగుతున్న ఆలస్యంపై అనేక ఆరోపణలు, సూచనలు వెలువడుతున్నాయి.

అసలు పురపాలకసంఘ పరిపాలనలో నున్న ప్రాంతాలు విడివిడి గ్రామాలవలె ఉండటంవల్ల నగరాభివృద్ధి కార్యకలాపాలపట్ల ఏకాభిప్రాయం ఏర్పడటమే అసంభవమైపోయింది. అన్ని ప్రభుత్వ కార్యాలయాలూ ఉన్న హనుమకొండలో ప్రజాప్రతినిధులతో పురపాలకసంఘ మేర్పడక పూర్వమే, పరిపాలన కొనసాగించిన ఉద్యోగులు "పురమందిరం" "పురోద్యానవనం" మొదలయిన నిర్మాణాలు జరిపించారు. ప్రస్తుత పురపాలక సంఘం మిగిలిన ప్రాంతాలలో ఇలాంటి ఏర్పాట్లు చేస్తుందని ఆశించడం జరిగింది. దురదృష్టవశాత్తూ మిగిలిన - వరంగల్లు - ప్రాంతాల ప్రజాప్రతినిధులు ఏకాభిప్రాయం ప్రకటించలేక అభివృద్ధి కార్యక్రమాలు వెనుకబడేటట్లు చేస్తున్నారనే నిందకు పాల్పడ్డారు. వీరి వివిధాభిప్రాయాలవల్ల ఆచరణాత్మకమైన ఎట్టి నిర్ణయమూ తీసుకొనడానికి వీలులేకుండా ఉన్నట్లు తెలుస్తున్నది.

రెండు సంవత్సరాలకు పూర్వమే నగరంలో ఒక పార్కు నిర్మించాలనుకున్నారు. కానీ అది ఎక్కడా అనే విషయంలో ఏకాభిప్రాయం లేకపోగా ప్రతి సభ్యుడూ తన ఇంటి ముందు పార్కుండాలన్నట్లు వాదించడం వల్ల తీర్మానం 'పార్కు-లేదా పార్కులు' గానూ పొందింది.

ఈ తీర్మానం అమలులోనికి రానందున పార్కు గాని పార్కులు గాని నిర్మాణం కాలేదు. నగరంలో అక్కడక్కడ గల స్థలాలను పురపాలక సంఘానికి చెందినవి. చిన్న పూదోటలు గా పురపాలక సంఘమే రూపొందించింది.

ఈ సంవత్సరపు బడ్జెట్టునుంచి రు 75 వేలు పార్కు నిర్మాణానికంటూ కేటాయించారు. అయినా మళ్ళీ స్థలం విషయం నిర్మాణానికి అడ్డు వచ్చింది. దేశాయిపేట వద్దగల 15 ఎకరాల స్థలాన్ని కొని పురోద్యానవనంగా నిర్మించాలని కొందరు సభ్యులూ, లాల్జీ మాపుకే స్థలం-సుమారు 5 ఎకరాలు-స్వాధీనం చేసుకొని పార్కు చేయాలని కొందరూ సూచిస్తున్నారు.

ఈ లాల్జీ స్థలాన్ని స్వాధీన పరచుకొనటం కష్ట సాధ్యమైనదనీ, ఒక వేళ అలా జరిగినా పెద్ద మొత్తం స్థలానికే ఖర్చు అవుతుంది కనుక అది పనికి రాదని, దేశాయిపేట వద్దగల 15 ఎకరాల భూమిని కొద్ది మొత్తంలోనే సేకరిస్తే లాభదాయకంగా ఉంటుందనీ కొందరి వాదన.

పురపాలకసంఘం 75 వేలు కేటాయించింది కాబట్టి, ఆ మొత్తాన్ని పూర్తిగా వినియోగించుకోవాలని అందువల్ల 10 వేలకు లోపు వ్యయంతో లభ్యం కాగల దేశాయిపేట స్థలాన్ని ఒక్క దాన్నే పార్కుగా రూపొందించాలంటే పంచవర్ష ప్రణాళిక అవుతుంది కాని తక్షణం ఉపయోగించదనీ, పైగా నగరానికి దూరంగా ఉన్న ఈ ప్రాంతం ప్రజోపయోగకరం కాజాలదని ఇంకొందరు వాదిస్తున్నారు. వీరి వాదన నగర మధ్యంలో అందరికూ అందుబాటుగానున్న లాల్జీగారి 5 ఎకరాల భూమి సేకరించి పార్కుగా చేయాలని.

మధ్యవర్తులుగా కొందరు పరిష్కార సూచన ఈ క్రింది విధంగా చేస్తున్నారు: (1) దేశాయిపేట స్థలాన్ని కొని ఆ 15 ఎకరాల భూమిని క్రమంగా ప్రజోద్యానవనంగా మార్చాలి. (2) [illegible] ప్రజోపయోగకరంగా "పార్కు" నిర్మించడం. (స్వ. వి.)

లని (యు. పి. పి.) శ్రీ ఆ. వెంకటేశం వాదించారు.

కొత్త రాష్ట్రానికి 'ఆంధ్ర-హైదరాబాద్' అనేపేరు పెట్టమని స్వతంత్ర సభ్యుడు శ్రీ సయ్యద్ హుస్సేన్ విజ్ఞప్తి చేశారు.

మార్పుల ఉద్దేశాలను ముఖ్యమంత్రి డాక్టరు రామకృష్ణరావు ఇట్లా వివరించారు:

"మైసూరు రాష్ట్రంలోకి మార్చే జిల్లాల ఏర్పాటు సంతృప్తికరంగా లేదు. ఇప్పుడు సూచించిన మార్పులు 1956 జూలైలో అమలులోకి వస్తవి: మహబూబ్‌నగర్ జిల్లాలోని పరిగి తాలూకాను, మెదక్ జిల్లాలోని వికారాబాద్ తాలూకాను హైదరాబాద్ జిల్లాకు కలపాలి."

"రాష్ట్రవిభజన జరిగిన తరువాత శాసనసభకు, పార్లమెంటుకు ఎన్నికల్లో పోటీచేసే అభ్యర్థులకు నివాసయోగ్యతలను సమకూర్చేందుకు కొన్ని అంశాలను కలపడం అవసరమైంది."

"రాష్ట్రంలోనూ, ఇతరత్రా ఉన్న కొన్ని జాయింట్ స్టాక్ కంపెనీలలో రాష్ట్రప్రభుత్వానికి వాటాలున్నవి. ఇతర ప్రాంతాలలోని జాయింట్ స్టాక్ కంపెనీలలోని వాటాలను ఆసులుగా మూడు రాష్ట్రాలు పంపిణీ చేసుకోవచ్చు. రాష్ట్రంలోని కంపెనీలలో [illegible] కాదు."

బిల్లు రెండవక్లాజుపై చర్చ శాసనసభలో నిన్న పూర్తికాలేదు.

# ఇండోచైనా సమస్యల పరిష్కారానికి భారత సూచనలు

## జులైదాకా ఎన్నికలు మాత్రం జరగవు అని కృష్ణమీనన్ ప్రకటన

పారిస్, ఏప్రిల్ 12: శ్రీ వి. కె. కృష్ణమీనన్ నేడు ఫ్రెంచి విదేశాంగ మంత్రి శ్రీ సి. పినేను కలుసుకొని 3 గంటలకు పైగా ఇండోచైనా వ్యవహారాలను వియత్‌నాం ఎన్నికల సమస్యలను చర్చించారు.

ఈ సమాలోచనలలో ఒక్క ఇండోచైనా వ్యవహారాలేగాక, ఉత్తర ఆఫ్రికా వ్యవహారాలు, ఇతర ప్రపంచవ్యవహారాలుగూడా వచ్చినట్లు అభిజ్ఞులు తెలియజేస్తున్నారు.

శ్రీ మీనన్ ఇవ్వాళే ఇక్కడికి వచ్చారు. నిన్న లండన్‌లో సర్. ఆంథోనీ ఈడెన్‌తో అనేక సమస్యలపై 45 నిమిషాలు మాటాడారు.

శ్రీ పినేతో సమాలోచనల అనంతరం పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ శ్రీ మీనన్ ఈలా అన్నారు. వియత్‌నాంలో ఎన్నికల వ్యవహారాన్ని జనీవా ఒప్పందం షరతులకు అనుగుణంగా తేల్చవలసి వుంది. ఇందులో అనేకమైన కష్టాలు వున్నాయి. లండన్‌లో నేను అనేకమందితో ఈ విషయమై చర్చించాను. ఇప్పుడు శ్రీ పినేతో చర్చిస్తున్నాను. ఒప్పందాన్ని అనుసరించి అయితే ఈ ఎన్నికలు ఈ వేసంగిలో జరగవలసి వుంది. కాని అది అట్లా జరిగేట్లు కన్పించడం లేదు. అందుకోసమే బ్రిటన్, రష్యాలను కలుసుకొని ఈ విషయమై ఏమి చేయవలసింది ఆలోచించమనికోరాము. వారు ఏమి చెయ్యాలెమో చెప్పడం మా పనికాదు. వారిని సమావేశపరచడం, ఈ విషయమై ఆలోచించ మనడం మా పని. ఆ బాధ్యతను పాలించాము."

"అయితే ఈ ఎన్నికలను ఒక సంవత్సరం దాకా వాయిదా వేయవలసిందని భారత దేశం సూచిస్తున్నదని వార్తలు విన్పిస్తున్నాయి, నిజమేనా?" అని విలేఖరులు ప్రశ్నించారు.

తాము అట్లు సూచించ లేదని శ్రీ మీనన్ సమాధానం ఇచ్చారు.

అంటే భారతదేశం ఇలాంటి సూచన ను చెయ్యలేదనేనా మీరు అంటున్నది అని విలేఖరులు నిగ్గదీశారు.

తన సమాధానానికి అట్లా అర్థం చెప్పరాదని శ్రీ మీనన్ అన్నారు. నేను నా మాట చెప్పాను. అయినా ఒక విషయం రూఢిగా తెలుస్తోంది. ఈ జూలైలో మాత్రం వియత్‌నాంలో ఎన్నికలు జరగవు అన్నారు.

అనంతరం విలేఖరులు ఈ ప్రశ్నే ఇంకా సాగదీయగా శ్రీ మీనన్ ఏమీ మాట్లాడలేదు.

శ్రీ పినే మాట్లాడుతూ ఉత్తర ఆఫ్రికా విషయంలో భారత దేశానికీ, ఫ్రాన్సుకు ఎలాంటి అభిప్రాయభేదాలు గాని లేదని అన్నారు. శ్రీ పినే ఈ సందర్భంలో విలేఖరులకు భారత ప్రధానమంత్రి తనకు స్వయంగా వ్రాసిన ఒక ఉత్తరాన్ని చూపిస్తూ, దీనితో అన్ని విషయాలు విశదమై పోయాయని చెప్పారు.

### భారతదేశం సూచనలు

ఇండోచైనా వ్యవహారంపై రష్యా, బ్రిటనులకు భారతదేశం కొన్ని ప్రతిపాదనలను అందజేసినట్లు, వియత్‌నాంలో స్వతంత్రమైన ఎన్నికలు జరిపివ్యవహారాన్ని తేల్చడానికి కొత్త ఒప్పందాని వ్రాసుకోవడం మంచిదని సూచించినట్లు తెలియవస్తున్నది. శ్రీ కృష్ణమీనన్ స్వయంగా ఈ ప్రతిపాదనను బ్రిటిషు మంత్రి రీడింగ్‌కు అందజేశాడని అభిజ్ఞులు అంటున్నారు. ఈ ప్రతిపాదనలో భారతదేశం ఈ ఎన్నికలకు ఇదమిద్ధమని ఒక తేదీని నిర్ణయించ లేదని, అయితే ఒక సంవత్సరంలోగా పూర్తి కావడం మంచిదని శ్రీ మీనన్ శ్రీరీడింగుతో అన్నారని మరికొన్ని వార్తలు విన్పిస్తున్నాయి.

### ఇంకో జనీవాసభ

ఇండోచైనా వ్యవహారంపై రష్యా, బ్రిటనులు సమాలోచనలను నిన్న ప్రారంభించాయి. రష్యాతరఫున గ్రోమైకో, బ్రిటన్ తరఫున రీడింగ్ ఈ మంతనాలను ప్రారంభం చేశారు. రష్యా, తిరిగి ఈ వ్యవహార పరిష్కారానికి నిన్న జనీవా రాజ్యాలను సమావేశపరచాలని కోరినట్లు, బ్రిటన్, ఆ సూచనను ప్రతిఘటిస్తున్నట్లు తెలుస్తున్నది.

ఇప్పుడు ఈ సమాలోచనలు వియత్‌నాం, లావోస్‌లను గురించి జరుగుతున్నాయి. ఈ సమాలోచనలలో ఆదిజనీవా సభలో పాల్గొన్న 9 రాజ్యాలు, ప్రస్తుతం పర్యవేక్షణ కార్యాన్ని సాగిస్తున్న మూడు రాజ్యాలు, ఈ వ్యవహారాన్ని గూర్చి చర్చించడానికి సమావేశం కావాలని గ్రోమైకో సూచించారు. మొదటి జనీవాసభలో బ్రిటను, ఫ్రాన్సు అమెరికా, రష్యా, చైనా, ఉత్తర, దక్షిణ వియత్‌నాంలు, లావోస్, కాంబోడియాలు పాల్గొన్నాయి. భారతదేశం, కెనడా, పోలండులు పర్యవేక్షణ కార్యం సాగిస్తున్నాయి.

## కొత్తరకం మిరపగింజలు

కర్నూలు, ఏప్రిల్ 11: "[illegible]" అనే కొత్తరకం మిరపగింజలను [illegible] [illegible] కృష్ణా [illegible] చేయడానికి, రాష్ట్ర ప్రభుత్వం రూ. 177516 లు మంజూరు చేసింది.

## నాగార్జున సాగరం

### ప్రాథమిక చర్యలు

కర్నూలు, ఏప్రిల్ 11: రూ. 15 లక్షల ఖర్చుతో "నాగార్జున సాగరం - అనకట్టవద్ద 'కాఫర్ డామ్' నిర్మాణం మేనెల ఆఖరుకు పూర్తి అవుతుం దనుకుంటున్నాం, గత సంవత్సరానికి కేటాయించిన రూ. 111 లక్షలు మార్చి ఆఖరుకు వెచ్చించాం. ఈ యేటికి కేటాయించిన రూ. 5 కోట్లు కూడా ఖర్చవుతు వనుకుంటున్నాం." అని నాగార్జున సాగరం ప్రాజెక్టు నిర్వహణ మండలి అధికారి శ్రీ ఎస్. చక్రవర్తి అన్నారు.

శ్రీ చక్రవర్తి ఇట్లా చెప్పారు:— "నాగార్జున సాగరం ప్రాజెక్టు వద్ద 5 వేలమంది పనిచేస్తున్నారు. అన్ని రకాల ఉద్యోగులకు నివాసగృహాలు నిర్మించేందుకు రూ. 60 లక్షలు కేటాయించారు. భవనాల నిర్మాణం చురుగ్గా జరుగుతున్నది. రూ. 15 లక్షల ఖర్చుతో వంతెన నిర్మాణం జరుగుతున్నది. 15 నెలల్లో పూర్తి అవుతుందనుకుంటున్నాం. కుడి, ఎడమ కాలవం దర్యాప్తు పనిజరుగుతోంది."

"ఈ ప్రాజెక్టుకు మొత్తం అయిదు సంవత్సరాలలో రూ. 84 కోట్లు వెచ్చించాలని అంచనా. కేటాయించిన మొత్తాలను సకాలంలో ఖర్చుచేసే ఏర్పాట్లుచేస్తున్నాం."

శ్రీయుతులు చక్రవర్తి, జఫర్ అలీ, సక్సేనా గారలు గతరాత్రి హైదరాబాదు వెళ్ళారు. శ్రీయుతులు జఫరాలీ, జె. ఎ. నరసింహారావు, డి. విశ్వనాథం, డాక్టరు కె. ఎల్. రావుగారలు రేపు నాగార్జున సాగరం ప్రాజెక్టు నిర్మాణ స్థలాన్ని చూచి సాంకేతిక వ్యవహారాలను చర్చిస్తారు.

## వంశధార ప్రాజెక్టు

### ఆంధ్ర ఒరిస్సా చీఫ్ ఇంజనీర్ల పరిశీలన

కర్నూలు, ఏప్రిల్ 13: ఆంధ్ర ఒరిస్సాల చీఫ్ ఇంజనీర్లు యీనెల 28 25 తేదీలలో సమావేశమై, వంశధార ప్రాజెక్టు విషయంలో ఒరిస్సా ప్రభుత్వం చేసిన సూచన విషయం పరిశీలిస్తారు. పర్లాకిమిడి ప్రాంతం మునిగిపోకుండా, సన్నానాయుడువద్ద రెగ్యులేటరు నిర్మించాలని, గొట్టపద్ద కట్టడాం ఎత్తు తగ్గించాలని, ఒరిస్సా ప్రభుత్వం సూచించింది.

ఒరిస్సాప్రభుత్వ ప్రోద్బలంపై ఉభయరాష్ట్రాల చీఫ్ ఇంజనీర్ల సమావేశం ఏర్పాటయింది.

ఆంధ్రప్రభుత్వం తరఫున చీఫ్ ఇంజనీరు శ్రీ ఎల్. వెంకటకృష్ణయ్యర్ సమావేశంలో పాల్గొంటారు.

అనంతరం, మే నెలలో ఆంధ్ర పబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీ సంజీవరెడ్డి, ఒరిస్సా ముఖ్యమంత్రి నబకృష్ణ చౌదరి పూరీలో సమావేశమై చర్చలు కొనసాగిస్తారు.

## మొజాంబిక్‌లో తుపాను

### వందలాది ఆఫ్రికన్ల మరణం

మొజాంబిక్, ఏప్రిల్ 11: ఉత్తర మొజాంబిక్ ప్రాంతంలో, క్రితంవారం తుపాను భీభత్సంలో, వందల కొలది ఆఫ్రికన్లు మరణించినట్లు వార్తవచ్చింది.

మెంజా అనే పట్టణం, నామరూపాలులేకుండా నాశనమైందట. 150 చదరపు మైళ్ళ విస్తీర్ణంలో ఒక్క పాక చెట్టుకూడా మిగులలేదట.

## నర్సాపురానికి పురపాలక సంఘం

కర్నూలు, ఏప్రిల్ 13: నర్సాపురం పంచాయితీ ప్రాంతాన్ని, చుట్టుపక్కల రుస్తుంబాద, చినమామిడిపల్లి గ్రామాలను చేర్చి పురపాలక సంఘంగా నిర్మించటానికి ఆ పురపాలక సంఘానికి, నర్సాపుర పురపాలక సంఘమని నామకరణం చేయాలని ప్రభుత్వం ప్రకటించింది.

అభ్యంతరాలేమైనా ఉంటే, ఏప్రిల్ 12 లగాయతూ, 6 వారాలలోగా స్థానిక పరిపాలనాశాఖ కార్యదర్శికి తెలుపుకోవచ్చు.

## మతాదాయ ధర్మాదాయ సంఘం

కర్నూలు, ఏప్రిల్ 13: హిందూ మతాదాయ, ధర్మాదాయ సంస్థల, సాముదాయక శ్రేయోనిధి, వినియోగానికి నియమించిన సంఘంలో, యీ దిగువవారిని అనధికార సభ్యులుగా నియమించింది. శ్రీయుతులు: [illegible] (విజయనగరం) పి. [illegible] (గుంటూరు) పి. లలితా ప్రసాద (గుడివాడ) పి. రమణారెడ్డి (రాజంపేట) శ్రీ మన కూరు బలరామరెడ్డి(బుచ్చిరెడ్డిపాలెం.)

# బ్రిటన్‌లో రష్యా నాయకుల పర్యటన

## బుల్గానిన్ వివరణ

మాస్కో, ఏప్రిల్ 11: బ్రిటన్‌లో సోవియట్ నాయకులు 16 వ తేదీనుంచి జరపబోతున్న పర్యటనను గురించి లండన్ టైమ్స్ విలేఖరి సోవియట్ ప్రధాని శ్రీ బుల్గానిన్‌ని ప్రశ్నించగా ఆయన జవాబిచ్చారు. వాటిని టాస్ వార్తాసంస్థ నేడు ప్రకటించింది.

ప్రశ్న: బ్రిటన్ రావటంలో మీ ఉద్దేశ్యం ఏమిటి?

జవాబు: బ్రిటిష్‌ప్రభుత్వ ఆహ్వానంమీద వస్తున్నాము. ఉభయ దేశాలకూ సంబంధించిన అంశాలను చర్చించదలచాము. నాయకుల సమావేశాలు వివాదాంశాలపై పరస్పరావగాహనకు ఎంతో తోడ్పడతవి.

ప్రశ్న: మీ పర్యటన అంతర్జాతీయ వైరుధ్యాలను ఏమయినా తగ్గిస్తుందా?

జవాబు: ఆశ మా ఆశ. దానికి మేము చేయగలకృషి అంతా చేస్తాము. కొత్తయుద్ధం రాకుండా నివారించాలని మా సంకల్పం.

ప్రశ్న: భారత, బర్మా, ఆఫ్ఘనిస్థాన్ పర్యటనలో మీ ప్రసంగాలకూ, బ్రిటన్‌తో మైత్రిని గురించి ఇప్పుడు చేస్తున్న ప్రసంగాలు విరుద్ధంగా లేవా?

జవాబు: అన్ని దేశాలతో నూ మైత్రిని సాధించాలని సోవియట్ యూనియన్ ప్రయత్నిస్తున్నది. మా వెనకటి పర్యటనలో ప్రసంగాలు, రష్యా, బ్రిటన్ల మైత్రికి వ్యతిరేకమన్న వాదం నిజంకాదు.

ప్రశ్న: మీ రాక అమెరికా, బ్రిటన్లను చీలదీయటానికేనని భావించబడుతున్నది. దీనికి ఏ మంటారు?

జ: ఒకరితో స్నేహం చేయాలని సోవియట్ యూనియన్ కోరితే, వారు తమ పాత మిత్రుల్ని విడిచిపెట్టక్కర లేదు. బ్రిటన్ స్నేహితులతో కూడా మేము స్నేహంగానే ఉండ దలుస్తున్నాము.

ప్ర: మీరాకవల్ల ఉభయ దేశాల మధ్య వ్యాపారం పెరిగే అవకాశం ఉన్నదా? అది లాభకరమేనా?

జ: వ్యాపారం అన్నది ఎడముగంగా ఉండటంకన్నా మేలు. శత్రుత్వంకన్నా ఎన్నోరెట్లు మేలు. మొదట వ్యాపారం అనేది ఉంటే ఇతర విధాల సహకరించేందుకు అవకాశం ఉంటుంది. వ్యాపారాన్ని పెంచేందుకు మంచి అవకాశాలు ఉన్నవి. నిర్బంధాలను తొలగిస్తే అది సాధ్యపడుతుంది. ఉభయులకూ అది లాభకరమే.

ప్ర: మీ రాక ఉద్దేశం వివాదాంశాలపై చర్చించి ఐకమత్యాన్ని సాధించటమని బ్రిటిష్ ప్రధాని అన్నారు. ఈ ఐకమత్యం కుదరటం సాధ్యమేనా?"

జవాబు: మాకు సంబంధించినంతవరకూ మేము సమాధానం కుదుర్చుకుందామనీ, ఐకమత్యాన్ని సాధిద్దామనీ ప్రయత్నిస్తాము. బ్రిటన్, రష్యాల మైత్రి యూరపులోనూ, ప్రపంచంలో ఇతర ప్రాంతాల్లోనూ శాశ్వత శాంతిని నెలకొల్పుతుంది.

## కొత్తకోట పంచాయితీ

### ఏకగ్రీవంగా సభ్యుల ఎన్నిక

మదనపల్లి, ఏప్రిల్ 12: కొత్తకోట పంచాయితీ సభ్యులు మొత్తం 9 మంది ఏకగ్రీవంగా ఎన్నికైనారు.

ఎన్నికైన సభ్యులు:—శ్రీయుతులు పి. కోదండరామరావు, డి. సుబ్బరామయ్య, జి. వెంకటసెట్టి మండి సిద్దయ్య, పెద్ద అప్పన్న, ఎం. రామిరెడ్డి, జి. దస్తగిరి సాహెబ్, పి. రామయ్య, ఇస్మాయిల్ ఖాన్.

## విజయవాడ భీమా ఉద్యోగుల సంఘం

కర్నూలు, ఏప్రిల్: 11 ప్రభుత్వము జాతీయం చేసిన జీవిత భీమా కంపెనీలలో పని చేస్తున్న ఉద్యోగులు నేడు విజయవాడ దివ్యజ్ఞాన సమాజ మందిరంలో శ్రీ ఎం. వి. శాస్త్రి అధ్యక్షతన సమావేశమై, విజయవాడ భీమా ఉద్యోగుల సంఘాన్ని స్థాపించుకొన్నారు. సంఘానికి యీ క్రింది వారితో ఒక కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు. అధ్యక్షులు: శ్రీ ఎం. వి. శాస్త్రి ఉపాధ్యక్షులు: జె. ఆనందరావు, ప్రధాన కార్యదర్శి: శ్రీ ఎస్. ఎల్. ప్రకాశరావు. సహాయ కార్యదర్శి శ్రీ వై. ఎస్. అవధాని, కోశాధికారి: బి. నరసింగరావు మరి 15 మంది సభ్యులు.

## ధర్మారం గంగపుత్ర సంఘం

కరీంనగర్, ఏప్రిల్ 7: కరీంనగరం జిల్లా ధర్మారములో శ్రీ పూస సీనయ్య అధ్యక్షతన గంగపుత్ర జనసంఘ సమావేశం జరిగినది. శ్రీ మాడ రాజన్న, శ్రీ శాగుల రాజమల్లయ్య బాలబాలికలకు విద్య నేర్పించడానికి ఎక్కువ శ్రద్ధ వహించాలన్నారు. స్థానిక సంఘానికి ఈ క్రింది కార్యవర్గం ఎన్నికైనది.

శ్రీ మేడి చిన్నరాజయ్య, (అధ్యక్షులు) శ్రీ కమ్మల బుచ్చయ్య (ఉపాధ్యక్షుడు), శ్రీ గోల్వాడి బాలయ్య (కార్యదర్శి), శ్రీ గోల్వాడి భీమయ్య (సహాయ కార్యదర్శి), శ్రీ గోల్వాడి నర్సయ్య (కోశాధికారి).

# కేంద్రప్రభుత్వపు మూడో తరగతి గుమాస్తాల జీతం హెచ్చింపు

## ప్రభుత్వం సిద్ధమని శ్రీ పంత్ ప్రకటన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 12: కేంద్ర ప్రభుత్వపు మూడో తరగతి గుమాస్తాల జీతాన్ని నెలకు 55 రూపాయల నుంచి 60 రూపాయలకు పెంచేందుకు ప్రభుత్వం సిద్ధమని దేశీయాంగ మంత్రి శ్రీ పంత్ నేడు లోక్ సభలో దేశీయాంగ శాఖ పద్దులపై చర్చకు జవాబిస్తూ వెల్లడించారు. నాలుగో తరగతి పనివాళ్లకు ఉన్నతోద్యోగులకు ఇచ్చినంత సెలవు ఇచ్చేందుకూ, ప్రివిలేజి టిక్కెట్ల సౌకర్యాన్ని తిరిగి ప్రవేశపెట్టేందుకూ కూడా ప్రభుత్వం సిద్ధమని ఆయన తెలియజేశారు. ప్రభుత్వోద్యోగాలకు వచ్చేవాళ్ళను ఇంటర్వ్యూ చేసే టప్పుడు వ్రాతపూర్వ పరీక్షకు ఉన్న నియమాలను కొంత సడలించే విషయం కూడా ఆలోచించేందుకు ప్రభుత్వం సిద్ధంగా ఉన్నదన్నారు.

చర్చకు జవాబిస్తూ శ్రీ పంత్ ఈ క్రింది అంశాలను కూడా వెల్లడించారు:

"నాగజాతి అతివాదులకు క్షమాదానం చేయాలని శ్రీ రిషాంగ్ కైషాంగ్ సూచించారు. ఫీజో, అతని అనుచరులు నాగ పర్వతప్రాంతం భారతదేశంలో అంతర్భాగమేనని అంగీకరించేట్లయితే తమ అత్యాచారాలను నిలిపివేసి లొంగిపోవాలి. హత్యానేరం చేసిన వాళ్ళకు శిక్ష తప్పదుకాని, ఇతరులను కనికరిస్తాము.

నిమ్నజాతుల కష్టాలను వాళ్ళ ప్రతినిధులు ప్రస్తావించారు. వచ్చే అయిదేళ్ళలోనూ నిమ్నజాతుల, షెడ్యూల్డ్ తెగల సహాయంకోసం రాష్ట్రాల్లో 58 కోట్లు, కేంద్రంలో 32 కోట్లు రూపాయలు ప్రత్యేకించబడినవి. వెనకటి అయిదేళ్లలో పెట్టిన ఖర్చుకన్నా ఇది 51 కోట్లు ఎక్కువ.

భూకంపాలు మొదలైన ఆపాంతరాల సమయంలో ప్రజలకు తోడ్పడటంలోను, అగ్నిప్రమాదాలను అరికట్టడంలోనూ శిక్షణనిచ్చేందుకు రెండు సంస్థలను ప్రభుత్వం నెలకొల్పబోతున్నది. పతిత స్త్రీలనూ, చెడుదార్లు తొక్కిన పిల్లలనూ కాపాడేందుకు దేశంలో అనేక శరణాలయాలను నెలకొల్పబోతున్నది.

భారతదేశంతో యుద్ధంచేసేందుకు ఎవ్వరూ సాహసించరనే నానమ్మకం. ఒకవేళ ఎవరయినా దాడిచేసినా, దేశీయాంగ శాఖ సరిహద్దుల రక్షణలో మైమరచి ఉండదని హామీ ఇస్తున్నాను.

దేశీయాంగశాఖ వ్యక్తిగత స్వేచ్ఛను పెంపొందించేందుకు పనిచేసింది. పత్రికల్లో ఆక్షేపణకరమయిన వ్రాతలను గురించిన చట్టం కాలదోషం పడుతున్నా, దేశీయాంగశాఖ దానిని అనుమతించింది. చట్టం లేదుకదా అని భావించకుండా పత్రికా రచయితలు తమ బాధ్యతలను నిర్వహించగలరని ఆశిస్తున్నాను."

బొంబాయి కల్లోలాల విషయమై న్యాయవిచారణ అనవసరమని శ్రీపంత్ తోసిపేశారు.

శ్రీ పంత్ జవాబిచ్చినమీదట దేశీయాంగశాఖ పద్దుల్ని లోక్ సభ ఆమోదించింది.

నిన్నటి చర్చలో శ్రీ బి. ఎస్. మూర్తి గ్రామాల్లో హరిజనుల కేటాయింపును విరసించారు. మరికొందరు సభ్యులు అస్పృశ్యతను విరసించారు.

## రాష్ట్రాల బిల్లు

### తిరుకొచ్చి ప్రభుత్వ ఆమోదం

తిరువేంద్రం, ఏప్రిల్ 12: రాష్ట్రాల పునర్నిర్మాణం బిల్లుపై, తిరుకొచ్చి ప్రభుత్వం తమ అభిప్రాయాలను కేంద్ర ప్రభుత్వానికి పంపినట్లు నేడు అధికారపూర్వకంగా ప్రకటన వెలువడింది.

వివిధ రాజకీయపార్టీల నాయకులను సమావేశపరచి యీ బిల్లుపై వారి అభిప్రాయాలను, రాష్ట్రప్రభుత్వం, తెలుసుకొని, వాటిని కేంద్ర ప్రభుత్వానికి కూడా తెలియపరచింది.

బిల్లులో, ఏర్పడనున్న కేరళరాష్ట్ర సరిహద్దుల విషయంలో రాష్ట్రప్రభుత్వం ఎలాంటి మార్పులు సూచించలేదు. రాజ్యసభలో ప్రాతినిధ్యమునకు సంబంధించి బిల్లులో ఉన్న నిబంధనలను రాష్ట్రప్రభుత్వం ఆమోదించింది. లోక్ సభలో, తిరుకొచ్చికి బిల్లుప్రకారం 18 స్థానాలు, రాష్ట్ర శాసనసభలో 126 స్థానాలు నిర్ణయించగా, జనాభానుబట్టి లోక్‌సభలో 19 స్థానాలు రాష్ట్ర శాసనసభలో 133 స్థానాలు నిర్ణయించవలసి ఉంటుందని రాష్ట్రప్రభుత్వం సూచించింది.

కేరళరాష్ట్రం యింకా కొంతకాలం రాష్ట్రపతి పాలన క్రింద ఉంటుంది గనుక, బిల్లు ప్రకారం ఏర్పాటుకాబోయే, ప్రాంతీయ మండలిలో, కేరళ ప్రతినిధిని రాష్ట్రపతి నియమించడానికి, బిల్లులో ఒక నిబంధన అవసరమని సూచించింది.

పూర్తిగా తరుగుజిల్లా అయిన మలబారును తిరుకొచ్చి కేరళలుపుకూ [illegible] గ్రాంటు తగ్గించవలదనడం భావ్యంకాదని, గ్రాంటు పెంచాలని రాష్ట్రప్రభుత్వం కోరింది.

## వింధ్యప్రదేశ్‌ను ఉత్తరప్రదేశ్‌లో కలపాలి

లక్నో, ఏప్రిల్ 11: "వింధ్యప్రదేశ్‌ను ఉత్తరప్రదేశ్‌లో కలపాలి, లేదా కనీసం, ఉత్తరప్రదేశ్‌ను ఆనుకొనిఉన్న బాఘెల్ ఖండ్ లాంటి ప్రాంతాలనైనా చేర్చాలి" అని ముఖ్యమంత్రి సంపూర్ణానంద ప్రతిపాదించిన తీర్మానాన్ని ఉత్తరప్రదేశ్ శాసనసభ యివాళ ఆమోదించింది.

రాష్ట్రాల పునర్నిర్మాణం బిల్లుపై మూడు రోజుల చర్చ అనంతరం శాసనసభ యీ తీర్మానాన్ని ఆమోదించింది.

